## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నాలుగు కథలు

## భరతుఁడు

ఎవ్వని పేరు విన్నంతనే యానాటి ప్రజానీకము గడగడలాడిపోయి పాదాక్రాంత మగుచుండెడిదో, ఎవ్వానికీర్తి పదునాల్గు భువనములందు మారుమ్రోగెనో, ఎవని యాత్మశక్తి లోకాతీతమై యవతార పురుషులనుగూడ గోవువెంబడి లేగలవలె నడిపించికొన్నదో, ఎవని తపశ్శక్తి బ్రహ్మర్షి సింహాసన మలంకరించి దుష్టశిక్షణము, శిష్టరక్షణమును జేయుచు జగజ్జేగీయమానముగ వెలింగెనో, ఏవ్యక్తి రాజాధిరాజుల పేరోలగములలోఁగూడ మహత్తర గౌరవమంది తనమాట కడ్డులేకుండ చెల్లించుకొనెనో అట్టి పురాణపురుషుఁడు, మహర్షి శేఖరుఁడు విశ్వామిత్రుఁడు.

హిమవంతమున ఆతఁడొకప్పుడు ఘోరమైన తపస్సు సలుపుచుండ దానికిందుఁడు తన దేవత్వమెక్కడ యూడిపోవునో యనుభీతిచేఁ దనయచ్చరలలో నతిలోక సౌందర్యవతి యగు మేనకను రావించి "మేనకా! నీవు సౌందర్య ఖనివి. నీ యంద చందములు హావభావములును మాకెన్నియో కార్యములు సాధించిపెట్టినవి. ఎట్టి కష్టతర కార్యముచు సాధించుటలోను నీకు నేటివఱ కపజయము లేదు. ప్రకృతము విశ్వామి

తుడు ఘోరమైన తపస్సు చేయుచున్నాడు. నీవక్కడికిపోయి యాతని మనోబల ధైర్యములను కలంచి, నీవలలోపడు నట్లాతని కావించి నా దేవరాజ్యపదవిని నిలుపుము. ఇది నీకు తప్పని సరి" అనెను. ఆమాటలకు మేనక కడుభయపడి గుండెలు గుట గుటలాడగా, సాహసించి దేవపతి కిట్లనియెను "సామీ! తాము పంచినపని కాదనరాదు గాని స్త్రీస్వభావము నన్ను ముందునకు గెంటుచుండ నిప్పలుకు లచుచున్నాను. దేవర మన్నింపవలెను. విశ్వామిత్రుడన్నంతనే నా గుండెలు కూలిపోయినవి. బ్రహ్మ తరువాత బ్రహ్మంత వాడతడు. వసిష్ఠునంత వాని ముప్పు తిప్పలుపెట్టిన మహాసత్వుడాయన. దేవాదిదేవత లందఱును ఆతని పేరన్నంత నులికి పడుచుచుందురు. అగ్నిశిఖంటి యామహా కోపనుని కడకు నావంటి దానినంప తమకు ధర్మమగునా? ఆతఁ డల్గికాంచినంతనే కులగిరులు కూలిపోవును. ఆతఁడు హుమ్మని నంతనే సముద్రము లింకిపోవును. ముల్లోకములు దిర్దిరతిరుగును. గాలి కదలవెఱచును. అట్టి పరమకోపనుని సన్నిధికి మావంటి పూబోడులు పోవసాహసింప గలరా సామీ!" అనెను.

"ఏమైనను సరే! ఈకార్యము సాధించుటే నీ సౌందర్య గర్వమునకు పట్టుగొమ్మ. నీవు జంకవలసిన పనిలేదు. నీకు జయమును శుభమును కలుగుగాక, మాఱుమాడక పొమ్ము" అని తనమహేంద్రత్వము పలుకుబడిలో పల్లవింప పురుహూతుఁ డనెను.

అచ్చెరువొందుచు మాటాడలేదు. వెంటనే నమస్కరించి యింద్రుని సెలవంది, దేవతల యాశీస్సులనొంది యామె మంచు కొండకు పయనమై కొందఱు సఖురాండ్రతో విశ్వామిత్రుని యాశ్రమము చేరెను. చేరి తనరూపసందచే నామె వనదేవత వలెనుండెను. సిగలో దేవకాంచనములు తురిమికొనెను. కస్తురి తిలకము దిద్దెను. బంగరువలిపము నొయ్యారముగా వలెవాటు వైచెను. తన దేహకాంతి తనతో పయనించుచుండ కలికిచూపులు కలువదండలగుచ్చుచుండ నడకలు మెట్టతామరల నడుగడుగున మొలకలెత్తించుచుండ నామె యా వనమందు పుష్పాపచయము సలుపుచుండెను. తోడిచెలికత్తెలును తానును నావనమున నెన లేని సింగారముట్టిపడ విహరించుచుండ చల్లని దక్షిణమారుత మావనితామణుల సిగలందలి కాంచనపుష్ప సుగంధమును హరించి మునివల్లభు ముకుపుటమ్ములకు కానుకగా నొసంగెను. వారి నూటియైన పాటల సుస్వరము మునీశ్వరుని చెవులలో వేయి వీణియలనాదము లొలికించెను. తోడనే యాతఁడు కన్నులు తెఱచి యుపాంతములకు దృష్టిపఱపి చూడగా మెఱపు తీగల గమి యొక్కమాఱుగా నాతని కన్నుల పొడిచివైచెను.

దూరమునుండి పసివట్టుచున్న మేనక మహాని చందమును గాంచి సఖురాండ్రతోఁ గూడ మునినిసమీపించి వినయముతో నాతనికి నమస్కరించి యాశ్రమాంతములందు తన మనసవిలాసము లుట్టిపడుచుండ విహారములు సల్పుచుండెను. మునియు తన

హానముద్ర మాని, తనయాసనము సడలించి మేనకవైపు పరి కించుచుండెను. ఇదే సమయముగదా యని యామెయు దన మోహనమగు నంగసౌష్ఠవము బయలుపడ నాట్యభంగిమములు ప్రకటించుచు క్రమక్రమముగ ముసిని సమీపించెను. తోడనే మునికి మనసు కలతపడి, స్థైర్యము నిలువక లేచి యామె కర మందికొని కూర్చుండ నియమించి యాతని మనోరథము తెలి పెను. కార్యసిద్ధి సుకరమైనదిగదా యని సఖురాండ్రు స్వర్గము నకై దారితీసిరి.

అట్లు మునిచే పాణిగ్రహణమందిన మేనక యాతనిని దగిన కామోపభోగములచే సుఖింపఁజేయుచుండ గర్భవతియైనవ మాసములు నిండి చక్కనిచుక్కవంటి యొక్క కుమార్తెను కనెను. పిదప తనవచ్చిన పని పూర్తియైనది గదాయని మేనక యాబిడ్డను నచటి మాలినీనదీ పులినమందుంచి స్వర్గమునకు వెడలిపోయెను. మునియు నప్పటికి తెలివిగాంచి "అరరే! ఎంత ప్రమాదమందితిని! చిరకాలార్జితమైన నా తపశ్శక్తియంతయు బూడిదలోపోసిన పన్నీరైనది. మనసు జాయిచేసికొని యొక మాల ముక్కుమూసికొనియుండ నీటుక్కులాడి నాకేల దాపు రించినదోగదా! పైగా నీసంతానము. ఆబిడ్డను నా మొగ మున పడవైచి పోవుటయును. "బలవానింద్రియ గ్రామో విద్వాంసమపి కర్షతి" అన్నది నిజముగా వేదవాక్యేగదా! ఇప్పుడీ బిడ్డను నేనేమిచేతును! అని పలువిధముల వాపోవుచు

"కన్నతల్లియే బిడ్డను విడిచిపోయినపుడు నీకేమి? ఆమెయే నీకు దారిచూపినది" అనుమాట లాతని హృదయమునకు తట్టెను తోడనే యా జడదారియు మనసు గట్టిచేసికొని యామె వట దిగవిడుచుచు, "ఈబిడ్డకెట్టి క్రూరమృగబాధయు నుండకుండు గాక" అని రక్షపెట్టి మరలి తపశ్చర్యకై తపోవనము చేరెను.

ఆ మునియొక్క ప్రభావముచే నా బాలికను ఆవన శకుంతములు మూగి తమ ఱెక్కలచే కప్పి యెండ తగులకుండ గాపాడుచుండెను. అంత నావనమునకు దనశిష్యగణముతో కణ్వ మహర్షి సమిత్కుశ ఫలాదులకై వచ్చి యా శిశువునుగాంచి యాతీరునకును, రూపురేకలకును, మనసులో ముచ్చటపడి వెంటనే పక్షులను బాఱదోలి, బిడ్డను చంకనిడుకొని తనయాశ్ర మమునకు తెచ్చి పెంచికొనుచుండెను. ఆమెయు శుక్లపక్ష చంద్రకళవలె దినదిన ప్రవర్ధమానయగుచు చెప్పనలవికాని రూప సంపదగలిగి యాయాశ్రమమునకు దేవతవలె నొప్పుచుండెను. వయసుతో పాటామెకు కణ్వుడే స్వయముగ కావ్యనాటక శాస్త్రాదికములు చక్కఁగ నుపలాలించి బోధించుచుండెను. చెప్పుటయె తడవుగా నామె మునివలన సమస్త విజ్ఞానములను గ్రహించెను. ఆమె అతిథుల పూజించుటయందును, దేవకార్య ముల దీర్చుటయందును, గృహకర్మము లాచరించుటయందును, ఉద్యానమందలి వృక్షములకు తగు దోహదములిచ్చి పెంచుట యందును మంచినైపుణ్యము సంపాదించెను. తన పితృదేవుల

యందామెకుగల భక్తిప్రపత్తులు వర్ణనాతీతములు.

ఇట్లుండనొక కొంతకాలమునకా యరణ్యమునకు పూరువంశ సంజాతుడును, నిఖిల మహీతలాధిపతియు, వర్ణాశ్రమ ధర్మరక్షణదక్షుడు నగు దుష్యంతమహారాజు సైన్యసమేతముగ వేటలాడవచ్చెను. వేటతమకము తీరినవెనుక మహారాజు దారిలోనున్న పూజ్యుడగు కణ్వుని యాశీస్సులంది పోవలెనని యాతని తపోవనము వినీతవేషుడై ప్రవేశించెను. ఆశ్రమమునందడుగు పెట్టుటతోడనే యాతని కుడికన్నదరెను. అపుడు రాజు “ఏమిది ప్రశాంతమగు నాశ్రమమునందుగూడ నాకీ శుభశకునములేల? ఐనను ఎప్పటికెచ్చట నేమి కానున్నదో యెవరెఱుగుదురు ?” అని యనుకొనుచు నడచుచుండ నచట లతామతల్లులు రాలుఁబూవులనాతని పూజించెను. వృక్షములు సుమాక్షతలుచల్లినవి. తుమ్మెదలు కోయిలలు తమ గానవిశేషములచే నాతని దీవించెను. ఆచటి వనవాతము లాతని శ్రమదీఱునటులు చల్లగా, మెల్లగా, పరిమళయుక్తముగా వీచెను. అట్లుముందుందుకు నడువగా హోమధూమములతోడను, వేదఘోషములతోడను, అధ్యయన మొనర్చు వటువుల కోలాహలముతోడను అఱగనులువెట్టి నిర్భయముగ నెమఱులు వేయు మృగకదంబములతోడను నేత్రపర్వమై, జగత్పావనమగుచున్న కణ్వమహాముని యగ్రహార మాతని కన్నులఁబడెను. సమీపించుచున్న కొలఁది

పర్ణశాలఁ జేరినంత కణ్వమహర్షి యింటలేడని యచటిముని బాలురు నివేదించిరి. అంతలో మేఘములనడుమ మెఱపుతీగవలె పూజకై పూవులుకోయుచు యుక్తవయసువచ్చియున్న శకుంతల యాతని కంటపడెను. ఆమెయు సనంతవిలాసముల జయంతుని పోలిన దుష్యంతుఁజూచి యతిసంభ్రమమున లోనికరిగి సగౌరవముగ నతిధిసత్క్రియలు కావించి యాసనమిచ్చి యోరగా నిలువంబడి కుశలంబడుగుచున్న నామెతో రాజు "మేము వేటలాడవచ్చియుం టిమి. మహాత్ములగు కణ్వగురుదేవుల దర్శించిపోవలెనని యిటకు విచ్చేసి యున్నాము. వారెచ్చటి కేఁగిరో" అని ప్రశ్నించెను.

దానికా శకుంతల "ఆర్యా! వారిప్పుడే రాఁగలరు. కంద మూల ఫల సంగ్రహార్థమై యీ పర్యంతములకే వెడలిరి. తమ రాక వారెఱిఁగి రేని వెంటనే రాఁగలరు. మహారాజా! వారు వచ్చునంతకు నొక్కముహూర్తమాగి మీకోరిక నెఱవేర్చికొని వెడలవచ్చును" అని యనెను. ఆ మాటలకును దాని వినయ సౌశీల్యములకును, ఆమె చాకచక్యమునకును రాజు మహానంద మొంది యామెను కన్యగాదెలిసి, సర్వ శుభలక్షణములతోఁ గూడిన యామె సకలాంగములను పరికించి సంచలించిన మనసు కలవాడై యుండ బట్టలేక "నీవెవ్వరి కూతురవు? ఇట్టి రూపలా వణ్య విభ్రమవిలాసలుగల నీ విందులకేల వచ్చితివి? ఈ ముని పల్లెలోనుండఁ గారణమేమి" అని ప్రశ్నింపగా నామె "ఆర్యా! జగదారాధ్యుఁడై, మహాధర్మ స్వరూపుఁడని పేరందిన కణ్వ

మహర్షి కౌమార్తెను” అని యామెకొంచెము సిగ్గుపడుచుసమా ధానమిచ్చెను. దానికి రాజు“ఆఁ ఈమె కణ్వుని కొమరితయా! ఇది మునికన్యయేయైన దీనియందేల నామనసు లగ్నమగును? నాచిత్తవృత్తి యెన్నడును నిట్టి తబ్బిబ్బుచేయనొల్లదే? ఈమె జన్మప్రకార మిదికాదు. నాహృదయమే దీనికి ప్రమాణము. మఱియు కణ్వుఁడు బ్రహ్మచారికాని వివాహితుఁడు కాఁడు. ఐనను దీనికింత వితర్కమేల? అడిగి తెలిసికొనఁగాక” అని లోపల ననుకొని “సుందరీ! నీవు పూజ్యపాదులైన కణ్వమహర్షుల కెట్లు పుత్రివైతివి? ఆతఁడింద్రియముల జయించిన యోగి. పవిత్ర చరిత్రకలవాఁడే? అతనికి నీవెట్లు జన్మించితివి? ఇది నాకుసందియ ముగా నున్నది. తెలిసికొనఁబలుకుము” అని యడుగ నామెయు “ఆర్యా! నాకు పదిపండ్రెండేండ్ల వయసుకాలమున నొక ముని తల్లజుఁడు మాయింటికివచ్చి మాతండ్రిగారితోపాటు సహపంక్తి భోజనమొనర్చుచుండ నాతఁడును మాజనకుల నీప్రశ్నయే వేసెను. అపుడు వారాతనికి నా వృత్తాంతమంతయుఁ జెప్పిరి. నేనదియప్పుడు వినియుండుటచే తమకెఱిఁగించుటకు వీలైనదనితన పూర్వగాథయంతయు నాజనపతి కెఱిఁగించి నాకు కణ్వులుభయ ప్రతాతలగుటచేవారికి నేనుపుత్రికనైతి”అనిచెప్పి యూరకుండెను.

వస్తుతత్త్వము తెలిసినంతనే దుష్యంతుఁడు“నానిశ్చయము సరిపడినది. దీనియెడ నిస్పృహ పడనవసరము లేదు. ఈమె రాజపుత్రికయే యని యామెచెప్పిన చరిత్రవలన స్పష్టమై

నది. విశేషించి యీమె యప్సరస్సంభవ. కావుననే యిట్టి రూపలావణ్యము లీమెయందు నిలిచెను. మఱియు నేనెట్టికాంత యందనురక్తుఁడనై యుంటినో యీమెయు నాయందట్టికోరికయే గలిగియున్నట్లు ఆమె మోము చెప్పకయే చెప్పుచున్నది. కాన తెలుపనేల ? స్పష్టముగా పలుకరింపవచ్చును" అని లోలో భావించి "సుందరీ ! నీసురూప సంపదగాంచినంతనే మఱిరెండు మూఁడు మాటలాడ నా హృదయము వేగిరించుచున్నది. ఇట్టి శరీర సౌకుమార్యము గల నీకీనారబట్ట లేల ? ఈచర్మము లేల ? మధురాహార పరమాన్నములు 'పాలవెన్నలతో సద్యోఘృత ములతో మునిఁగి తేరవలసిన నీకీదుంపలు, కాయలు, పండ్లు, ఆకులు భోజనమా ? రమణీయములైన యంతఃపురములలో దాసదాసీ జనములతో నిండి కనుసన్నలతో పనిపాటలు చేయించు కొనుచు, రాజసౌధములలో నివసించుటకు బదులు నీవంటి మహానుకుమారికే తాటాకుటింట నివాసమా ? ఈ కటుకురాల తాఁకుపడి నీపాదములు ఎంతకంది కర్కశములై పోయినవో గదా! ఇట్టి సౌందర్యఖనివి నీకీమునిపల్లెలో నివాసమేల? నీసావా సము ఈమృగములతోనా? నీ మృదుకరాంగుళులీ దర్భలు తఱు గుటకా? ఎంత దారుణము! నీ కిప్లుండుటకెట్లు తోఁచుచున్నదో గాని నాకేమియు బాగున్నదికాదు. నాకు నీయందనురాగము కలిగినది. నీవును నాయందట్లే యుంటివనుకొందును. కాన నీవు నాకుభార్యవై నారాజ్యలక్ష్మికి ప్రతిలక్ష్మివై మహానీయ సుఖ

ముల గాంచుము. నా సౌధములలో, నా మణికుట్టిమములపై, నాసువర్ణ మృదుతల్పములయందు నీవు హాయిగనుండవచ్చును. వివాహములలో గాంధర్వము మనవంటివారికి శాస్త్రవిహితమైనది. కాన నీవు వెనుదీయక నన్ను పరిణయమగుము" అని పట్టరానితమకమున బలుక నా శకుంతలయు నవనతవదనయై "మహారాజా ! లోకనాథులగు మీరాజ్ఞను, మీయాజ్ఞలకును తిరుగుండునా? మేమందఱము మీ సేవకులమే! తమరిట్టి కోరికతోనున్నప్పుడు కరుణాకరుడును, ధర్మస్వరూపులును నగు నా జనకులు వచ్చువేళయైనది. వారికి మీ యాప్సితంబెఱిగింపుడు. వారు మీ యానతి మన్నించితీఱుదురు. దానికినే నొడంబడెదను. వారువచ్చి మీకు నన్నొసంగి కేని పిదప తామునన్ను పాణిగ్రహణము సేయుడు" అనెను. అంత దుష్యంతుడును "వనితాశిరోమణీ! నీవెఱుగని దానవౌటచే నిట్లనుచున్నావు. గాంధర్వవివాహమున కంతవఱకు పనిలేదు. దానికి బెద్దలతో సంబంధము లేదు. తనకుతానే చుట్టము. తన్నిచ్చుకొనుటకు తనకే సర్వాధికారము. అది రహస్యముగ జరుగును. దానికి మంత్రము లవసరము లేదు సుమా! కాన నీప్రసమయమును వ్యర్థపఱుపక ధర్మసమ్మతముగ నంగీకరింపుము" అని యామె నొడఁబడునట్లు చేయగా నామెయు "మహారాజులు తమంతతామై కోరుచుండ మీమాటతో సైవైన సాహసము చాలకున్నది. మీ చెప్పినట్లే నేసంగీకరింతును. కాని నాదొక కోరికగలదు. నీ యనుగ్రహ

ముచే నాకుపుట్టిన నందనుఁడే నీవెనుక యౌవరాజ్యపట్టభద్రుఁడు కావలెను. ఈ మాటకు తిరుగుండరాదు. దీనికి పంచమహాభూతములే సాక్షులు. అట్లయినచో మీతో నాకు సంగమమగును” అనిన విని రాజు శకుంతలకెంతయు సంతోషంబుగా దానికావరమొసంగి గాంధర్వవిధి నామెను పెండ్లాడి యభిమత సౌఖ్యములననుభవించి ఒకనాఁడామెతో “రమణీ! మేమింక నగరమునకు బోవలయును. నిన్ను వెనుక తీసికొనిరాగల నా పరివారమును కణ్వమహాముని పాలికి పంపెదను. నీవిందుకై బెంగపడవలసినది లేదు” అని బోధించి యొడంబఱచి యక్కోమలి వీడ్కొని నిజపురమునకుఁ జనెను.

ఇంకనిట శకుంతలయు తన చేసిన స్వాతంత్ర్యమును తండ్రిగారెఱిఁగి యేమందురో యని పరిపరివిధముల వెఱచుచు, కొంత తడవును, అయ్యో! తొందరపడితిని. పురుషులెంత సాహసులు. అని యేమేమో యనుకొనుచు కొంతతడవు వెళ్ళబుచ్చుచుండ నంతలో నమ్మహాముని యడవినుండి కందమూల ఫలములను గొని చనుదెంచి పర్ణశాలముంగిలికి వచ్చెను. శకుంతలయు శృంగారభావమున లజ్జావనత వదనయై, తండ్రికెదురుగ పోలేక అతిభీతచిత్తయై తలుపోరగ నిలిచియుండ నా క్రొత్త విధానము గాంచి ముని యిదియేమని తన దివ్యదృష్టిచే నంతయుగ్రహించి కూతుంగాంచి “అమ్మా! నేను వచ్చుచున్నంతనే నాబుజముపై మూటనందికొన నెదురయ్యెడిదానవే! నేఁడట్లు చేయవేదేమి?

నాకు పాద్యము లిచ్చెడిదానవే? నాయొడలి చెమటలుపోవ పీటపై కూర్చుండబెట్టి విసరెడిదానవే ? ఈనాడట్టివి లేవేమీ ? కలకలలాడు నీమోము వెలవెల బోవుచున్న దేమమ్మా! నీవు తప్పుచేసినవారివలె సంకోచ మందుచున్నట్లున్నది. సంకోచమేల పొందవలెనమ్మా! నీవొనర్చిన దానిలో ధర్మసమ్మతము కాని దేమైన నున్నచో సంకోచము నందవలెనుగాని లేకున్న నేల ? వచ్చినవారా ? చక్రిసస్తులు నీవా? ఆబంగారమున పొదుగవల సిన రత్నమవు. తల్లీ! నీ కులగోత్ర సౌందర్యములకు దగిన పతిని సంపాదించికొంటివమ్మా ! దీనికై దేశదేశములు తిరుగవలసిన శ్రమనాకు తప్పించితివమ్మా ! జానులే మహానది సముద్రమును విడిచి వేఱొకచోట నడుగిడునా? బిడ్డా! సంకోచమందకుము. నీ విపుడు సద్యోగర్భము ధరించియుంటివి. నీ గర్భమందున్న వాఁడు సప్తభువనములను పాలింపగల చక్రవర్తి నుమీ ! నీధర్మ చరిత్రకు మెచ్చితిని. నీవుకోరిన వరమొసంగెద వేడుమనిన శకుంత లయు "తండ్రీ! నాకడుపున పాలుపోసితిరి. నాయుద్వేగమంతయు చల్లారినది. నాగుండెల యదటు తీఱినది. నామనసు కుదుటఁ బడినది. మీదయయే నాకు వరము. వేఱుగ వరములవసరము లేదు. ఐనను కోరుకొమ్మనినారు గాన "నా మానసమెప్పుడును ధర్మమునందే తగిలియుండుటకును, నాకుదయించు కుమారుఁడు దీర్ఘాయురారోగ్య బలాదులనొంది వంశకర్త కావలయు" నని కోరఁగా నాతడట్లేయని యనుగ్రహించెను.

పిదప కణ్వుఁడును యథాశాస్త్రముగా శకుంతలకు గర్భిణీ సంస్కారములు చేయించి కనురెప్పలోనుంచి కాపాడుచుండ మూఁడువత్సరములు గడచిపోయెను. అపుడొక శుభముహూర్తమున శకుంతల కళాపూర్ణునివంటి కుమారునికనెను. ఆతనికన్ని యంగరక్షలును, కణ్వుడేచెప్పి తనబిడ్డచే చేయించుచు క్రమముగ నాతనికి జాతకర్మాదికములు నిర్వర్తించెను. తండ్రి చెప్పినరీతిగ నాబిడ్డయందట్టి చక్రవర్తి చిహ్నములున్నవో లేవో యని శకుంతలయు పదేపదే కుమారు నాననము వీక్షించెను. అంగములు పరిశీలించెను. ఆతని హస్తములలో చక్రరేఖలుండెను. హస్తములు మోకాళ్ళు దాటి పొడవులైయుండెను. మంచి బలిష్ఠమైన దేహాయష్టికలిగి, విశాలఫాలము, సోగకనులు, దీర్ఘ కర్ణములు మున్నగునవన్నియు నాతని భావి మహానుభావత్వ మునే చాటుచుండ తల్లి కమితానందమయ్యెను.

పిల్లవాని కేడెనిమిదేండ్ల వయస్సువచ్చుటోడనే యాతని శైశవక్రీడలు మిగుల విచిత్రముగనుండెను. పువ్వుపుట్టుటతోడనే పరిమళము దూరముగ వ్యాపించునుగదా! ఆతఁడొంటరిగ నట్టడివిలోనికిపోయి పులిపిల్లలను, వనవరాహములను, ఏనుగు గున్నలనుదెచ్చి యాశ్రమమందలి చెట్లకు లేగలనుకట్టినట్లు కట్టుచుండెను. ఒకొక్కప్పుడు మదపుటేనుగులపై కెక్కియు, సింగములపై స్వారీచేసియు నుద్దండుడై యొప్పుచుండెను. భయమన్నది యాతనిలోలేదు. సింగపుకోదమలను పట్టి రెండుదౌడలను ఫెక

లించి "సింహమా! నోరు తెఱువుము. తెఱచెదవా లేదా ! నీ దంతము లెన్ని యున్నవో నేనిప్పుడు లెక్కింపవలెను" అనియనుచు చేతికోలచే దాని నెత్తిపై బాదుచుండును. ఇట్లావనములోని సత్వములను బాధించుటఁ గాంచి యచటవారందఱును వీనికి సర్వదమనుఁ డను పేరు పెట్టి పిలుచుచుండిరి. కణ్వుఁడును నా కుమారుని యుదార తేజోగుణరూపములకు సంతసిల్లి వీనికఖిల భువన భారము తాల్పసమర్థత వచ్చినది. ఇంక వీని నిటనుంచినచో నీ వనమంతయు నిస్సత్త్వమగును. అని విచారించి యొకనాఁడు తన కుమార్తె కిట్లనెను.

"అమ్మా! ఎట్టి స్త్రీలకైనను పుట్టినింట పెద్దకాలముండుట తగనిపని. సతులు పతులయొద్దనే యుండుట మంచిది. సతుల కేమగడయు తమతమ పతులేగాన పతినివిడిచి నతి దీర్ఘకాలము మసలరాదు. కావున నీవీకుమారుని తోడుకొని నీ పతిగృహము నకుఁబొమ్ము. మహాతపోధనులైన నాశిష్యులను నీకు దోడుపంపె దను" అని తత్కాలోచితములైన కొన్ని నీతులు సెప్పి శకుంతల నత్తవారింటి కంపెను. ఆమెయు దౌష్యంతుని దోడ్కొని దుష్యంతు పాలికివచ్చి సకల సామంత మంత్రి పురోహితులతో మహావైభవముగ గొలువుతీర్చియున్న యారాజునుగాంచి తన్నెఱిగించుకొని నిలువబడెను.

కాని మహారాజున కేమియునుగోచరింపక తెలియనివాని పగిదినుండెను. అప్పుడామె "అన్నన్నా! ఆనాడునా తండ్రిగారి

యాశ్రమముచేరి నన్ననునయించిన విధము, నాయందుచూపిన యనురాగము, ఆదరము, ఆకరుణయు నీశేఁడు మఱచె శాఁబోలు నిజముగా నన్నెఱుఁగడా? ఎఱిఁగియు నెఱుఁగని యట్లు నటించు చున్నాఁడా? లేక చిరకాలమై జరిగియున్న యీ వృత్తాంతము జ్ఞప్తికిరాలేదా? మహారాజులు ముఖ్యులు, వారు బహువ్యాపార భారమగ్నులు. అట్టివారు మఱచినను సంభవమే. లేక యీ నాఁడన్న మాటలుతప్పదలఁచి యిట్లు నటించుచున్నాఁడా? ఏమీ ముఖకాంతి! ఏమీ దృష్టి విక్షేపము? ఏమంత క్రూరముగ నున్నదే? కారణమేమైయుండును? ఏమో ఆఁనాడుమిగుల ప్రేమ యుక్తముగా భాషించిరిగదా యని యనుకొంటిని అన్నన్నా! అది పొరపాటు. రాజులు నవప్రియులు. వారినినమ్ముట వెఱ్ఱి తనము. ఐనను మఱచినవానికి తెలియువఱకుఁ జెప్పవలెను. ఎఱిఁగియు దెలియనట్లు నటించెనా? అట్టిమూర్ఖునికి దెలుప నెవ్వ రికిని శక్యముకానేకాదు" అని తనలోననుకొని "జననాథా! నీవు వేఁటకై యొకప్పుడు కణ్వాశ్రమమునకు వచ్చుటయు, నన్ను బ్రేమించి నాకు వరదానముచేయుటయు నీమనసులో జ్ఞప్తికి దెచ్చుకొమ్ము. ఇదుగో నీ కుమారుఁడు. వీఁడు బాలార్క తేజుఁడు. నీవన్నమాటతప్పక పౌరవకులమున రత్నమువంటి వీని యువరాజుగఁ జేయుము. ఇంతన్నృతమేమియు లేదు" అని వచింప రాజు దానినంతయు నెఱింగియు నెఱుంగనివాడపోలె నిట్లనియె.

"నీవెక్కడిదానవో నేనెఱుఁగను. ఎక్కడనుండి వచ్చి

తివో యక్కడికేపొమ్ము. ఇది ధర్మసభ. ఇందనృతములకు తావు లేదు. నీవిధము చూడ అనుచితములు పలుకుచున్నట్లున్నది. ఇట్టి కలవిలేనివియు కల్లమాటలు కల్పించి పలికినంతమాత్రాన నేనధర్మమునకు పూనెదననుకొంటివా!" అని గద్దించిపలికెను. ఆ మాటలు విని శకుంతల నిలువెల్ల నీరైపోయి, వేడిగ నిట్టూర్చి, నిశ్చేష్టితయై, కన్నులనుండి జలజల బాష్పములు రాలగా తల వాల్చి లోలోన గ్రమ్ముకొనివచ్చు దుఃఖభారము నణచికొనుచు లేనిధైర్యము తెచ్చికొని యారాజున కిట్లనియె.

"రాజా! అన్నియుం దెలిసిన వాఁడవు. తెలియని మూర్ఖుల వలె నేనేమియు నెఱుఁగనని పలికెదవది ధర్మమా? నేనొకడనే గాని యీవని పరులెఱుఁగరని నన్ను త్రోసిపుచ్చు చుంటివా? ధార్మికులెట్టి సమయములందైనను ధర్మము తప్పుదురయ్యా? ఒకవేళ తాను తప్పనెంచినను మనుజ వ్యాపారములన్నిటికిని సర్వదా వేదములు, పంచభూతములు, ధర్మదేవత, సంధ్యలు, అంతరాత్మయు, యముఁడు, చంద్రసూర్యులును, రాత్రిందివములును, సాక్షిభూతములు. అట్టివాఁడిఁక నెవరిని వంచింప గలఁడు? నీవు నాఁడు నాకిచ్చిన వరమునకు పైవన్నియు సాక్షీభూతములు. కాన నీవు నన్ను తిరస్కరించి పంపవలదు. పతివ్రతయు, గుణవతియు, సంతానవతియు, అనుకూలయు, నైన ధర్మపత్నిని తిరస్కారభావమున గాంచునతని కిహపరములుండవు. పెండ్లాడిన పత్నిని సంతోషపెట్టి యనుగుణముగ వర్తించు

వాఁడు గృహమేధి ఫలమంతయు పొందును. వాఁడే క్రియావంతుఁడు, దాంతుఁడు, పుత్రవంతుఁడును. మఱియు భార్యాపుత్రాదుల నాదరించుట యొకకామ్యక్రతువు సేయుట. సత్ప్రత్నియన నీవేమని యెంచుచుంటివో గాని, యామె ధర్మార్థకామసాధన కుపకరణము. విమలచరిత్ర విద్యకు గురుఁడు. వంశస్థితికి మూలమైనది. సద్గతికి పట్టుఁగొమ్మ. గౌరవమునకు కారణము. ఉన్నతగుణమణుల కామెయాకరము. ఆనందమున కాటపట్టు. పతులనెట్టి ఘట్టములందైనను, ఎట్టి యాపదలలోనైనను, కాపాడి యుద్ధరించునది భార్య. మఱియు భార్య పురుషునియందర్ధభాగము గాన నొకరినొకరవమానించి కొనుట తమ్ముతాము పరాభవించుకొనుటే. "అంగాదంగాత్సంభవతి" అను వేదవచనానుసారము పురుషుఁడు భార్యయందు ప్రవేశించి గర్భంబున పుత్రుఁడై తానేపుట్టును. కాన పుత్రునకును దనకును భేదములేదు. మఱియు "పున్నామ్నోనరకాత్త్రాయత ఇతిపుత్రః" అనునార్యోక్తి ననుసరించి పుత్రుఁడుభయపక్షములవారి నుద్ధరించును. ఒక దీపమునుండి వేఱొక దీపము వెలింగినట్లు నీపవిత్ర దేహమునుండి యీపుత్రుఁడుద్భవించెను. వీనినొక్కసారి రాజా! కౌగిలించికొమ్ము. ఆసుఖము చెప్పనలవి కానిది. అది చందనములచే గాని, పచ్చకర్పూరముచేగాని, వెన్నెలచేగాని లభింపబోదు. మఱియు నీయీపుత్రుఁడు వంశకరుఁడై నూఱువాజపేయములు లొనర్చి కీర్తిఁగాంచునని సరస్వతి చెప్పగా

మునులు వినియున్నారు. వ్యర్థముగా సిరిరా మోకాలొడ్డునట్లు ఇట్టివంశ విస్తారకుని తప్పఁజూచుట నీకు న్యాయముకాదు. ఆ నాఁటి సత్యవాక్యము లేదా రాజా! దానినికాదందువా ? అమృతోదకము నిచ్చు నూఱునూతులను త్రవ్వించుటకంటె యొక్క దిగుడుబావి నిర్మించుటమంచిది. అట్టి బావులు నూఱింటిని నిర్మించుటకంటె యొక్క సత్క్రతువుచేయుట యుత్తమము. అట్టి కతువులు నూఱొనర్చుటకంటె ఒక్కపుత్త్రుఁడు మేలు. అట్టి నూర్గురు పుత్త్రులకంటె నొక సత్యవాక్యము గొప్పది. వేయి యశ్వమేధములుగూడ సత్యముతో సాటిరావు. ధర్మములలో నెల్ల పరమధర్మమైన సత్యప్రభావ మనంతము. సర్వపుణ్య తీర్థముల దర్శించిన పుణ్యమును, సర్వవేదములను బఠించిన ఫలముగూడ సత్యఫలమునకు సాటిరావు. కాన సత్యమును పుత్త్రునిఁగూడ నిట్లుగా నీవుభాషించి, ఆనాఁడు నీవు కణ్వాశ్రమమందన్న సమయముతలచి నన్నుదయతో పరిగ్రహించి నీకుమారుని గారవింపుము. నామాటలు నమ్ముము. ఇంతవాఁడైన విశ్వామిత్రునకును, మేనకవంటి యచ్చరమానికమునకును బుట్టిన నేనీపాటి దానికసత్యదోషమున కాలువెట్టుదునా? నేనంతి యధర్మురాలను గాను" అని దీర్ఘోపన్యాస మొసగిన శకుంతలకు రాజు "పెద్దలున్న సభలో నోటికివచ్చినట్లనెద వేల? నీ వెవ్వతవు? నేనెవ్వఁడను? పీడెక్కడికొడుకు ? నిన్ను నేనెన్నఁడును కనివిని యెఱుఁగను. స్త్రీలకేమి? వారికిబొంకులు నేర్పనక్కఱలేదు. ఆడువారు

బొంకినచో గోడకట్టినట్లేకదా! లేనిపోనికల్లలాడి నన్నీమహాబల పాపకూపమున ముంచజూచెదవు? నీకిది మంచిగాదు. మహా బలవంతుని, ఇంతపెద్దవానిని, సాటిలేని యిట్టికొడుకును కని ఇంద అనుచూచి నవ్వగా నాకొడుకని నీవువచించుచుట హాస్యాస్ప దము. ఇట్టి లోకవిరుద్ధములకేము భయపడుదుము. వ్యర్థమైన మాటలుపలుకక నీ యాశ్రమంబునకుపొమ్ము. నీగౌరవము నీవు దక్కించుకొని నాగౌరవము నాకునిలుపుము. అని పలుక శకుంత లకు నవనాడులును కృంగిపోయెను. నదీప్రవాహమువలె దుఃఖ ములోపలనుండి వెల్లువయై పైకుబికెను. ఆమె హృదయభారం మాపికొనలేక "అయ్యయ్యో! ఎంతపాపాత్మురాలిని. ఎన్నికొట్ల నోములునోచి జన్మించితినో? పుట్టినతోడనే తలిదండ్రులచే విడువబడితిని. ఇప్పుడు పతిచేఁగూడ దిరస్కరింపబడితిని. ఇంక నన్నాదరించు వారెవరు? నాజన్మమెవ్వరికై నిలువవలెనో! నా బ్రతుకు అడవికాచిన వెన్నెలయైనది. ఇంత పరాభవమంది జీవిం చుటకంటె మఱియొక నీచత్వముండదు" అని హోరుమని రోదిం చుచు, కన్నీరద్దికొనుచు చేయునదిలేక దైవమే శరణమనుకొని యామె తనకుమారుని వెంటనిడికొని పోఁబోవుచుండగా "ఓ దుష్యంత మహారాజా! ఈపిల్లవాఁడు మీయిరువురకును బుట్టిన కుమారుఁడే. ఈమె నీవు ప్రేమించి పెండ్లాడిన భార్యయే. వీరిని చేకొనకున్న నీకు మహాపాపము. ఈమె మహాపతివ్రత" అని యొక యశరీరవాణి సభాసదులు విస్మయమంద పలికెను. అంత

నచటివారందఱును మిగుల సంతసించిరి.

అప్పుడు దుష్యంతమహారాజు లేచి "అయ్యలారా! ఇప్పు డాకాశవాణి పలికినది మీరు విన్నారుగదా ! ఇదంతయు నాకు తెలియక చేసినదిగాదు. ఈమెను నేను పెండ్లాడుట మిక్కిలి రహస్యముగా జరిగినది. కాన నీమెనుపరిగ్రహించినచో లోకా పవాదము నాకంతము జుట్టుకొనును. కాన నట్లంటిని. ఇప్పుడా కాశవాణియే యందఱను నమ్మించినది" అని పరుగుపరుగున సభలోనుండి యివ్వలకువచ్చి తన కుమారునిగ్రుచ్చి కవుగిలించి శకుంతలనతి ప్రణయ గౌరవములచే సంభావించి యావరాజ్య మునకు భరతు నభిషేకించెను. పిదప కొంతకాలము తానుధర్మ పాలన మొనర్చి తన రాజ్యభారమంతయు భరతున కొప్పగించి దుష్యంతుఁడు తపోవనమునకుఁ బోయెను.

భరతుఁడు సమస్త భూభారమును జక్కగ వహించి యనేక యజ్ఞయాగాదులచే దేవతలను, సకలసాహాయ్యములచే ప్రజలను తృప్తిపఱచి, తన కీర్తిచంద్రికలు దిగ్దిగంతముల వఱకు వెన్నెలలు కాయ, సకల జనానందకరముగ పెక్కు వేలేండ్లు పాలించెను. అట్టి మహాపురుషునిచే పాలింపఁబడుటచేతనే మన ఖండము భరతఖండమను దివ్యనామముందెను. నేఁటికిని ఈదివ్య నామము అచలమై, దివ్యమై, ధార్మికమై, తాత్వికమై ఆ సేతు హిమాచలము మారుమోగుచున్నది.

---

# లక్క యిల్లు.

కౌరవపాండవులు హస్తినాపురమున ద్రోణువలన ధనుర్విద్యాసాంగముగ నభ్యసించి, గురుదక్షిణగా ద్రుపదు పట్టి తెచ్చి గురున కత్యంత ప్రియము కావించిరి. అట్లు కొంతకాలము జరిగిన పిదప దుర్యోధనుని దురాలోచనము విని ధృతరాష్ట్రుఁడు పాండవుల వేఱుపఱుపఁదలఁచి వారణావతమున పురోచన శిల్పాచార్యులచే నొక దివ్యభవనము నిర్మింపఁజేసెను. ఆశిల్పియు దుర్యోధన ప్రేరితుఁడై యాభవనమును లక్కతోడను, ఆజ్యతైలములతోడను మిగుల రమణీయముగ నిర్మించెను. పెదతండ్రి యాజ్ఞానుసారముగ పుణ్యాహవాచనము కావించి పాండవులు తమ మాతృశ్రీతో నాగృహప్రవేశము కావించిరి.

ఆ భవనమున వసించుచుండ నొకనాఁడు ధర్మరాజు భీమునితో “తమ్ముఁడా! మనమీ భవనమున నివసించుట మిగుల ప్రమాదము సుమా! ఏమందువా దీనినిర్మాణ చాతుర్యమును, దీని కృత్రిమ రమణీయమును ఈగోడల తైలాజ్యలాక్షాగంధమును గాంచినంతనే నా కనుమానమగుచున్నది. మఱియు నిది శస్త్రాగార సమీపమునగట్టబడినది. దీనికి తార్కాణముగా మన మిటకు వచ్చునపుడు విదురుఁడుగూడ “నాయనలారా! కారణము లేకుండ మిమ్ము ధృతరాష్ట్రుడు వేఱుగనుంచినవాఁడు కాఁడు. మీరు లేమఱక విషాగ్నులవలన నప్రమత్తులై యుండవలయుఁ

జూడీ!" అని నొక్కి చెప్పియున్నాఁడు. కావున విశ్వసించి మన మిందుండరాదు. దీనివలన మన కగ్నిభయము తప్పదు" అని తెలిపెను. భీముడా మాటలువిని "అన్నా ! ఇది మాయా గృహామా? ఈపురోచనుఁడిట నహర్నిశము కాఁవుండుటగూడ మన యనుమానమును బలపఱచుచున్నది. వీఁడు దీనికెప్పుడో నిప్పుపెట్టుటకే దుర్యోధనునిచే నియమింపఁబడి యుండవచ్చును. మనమిందుండనేల ? దీనికి మనమే యగ్గిపెట్టి యీపురోచనుని కాల్చిపోవుదము" అని సమాధానమిచ్చెను. దానికి ధర్మరాజు "నాయనా! తొందరవలదు. దీని లోతుపాతులు తెలిసితిమి గదా! మనము ప్రమాదము పొందక తెలియనట్లే నటింపవల యును. ఈపురోచనుఁడు తాను చేయఁదలచినది యెప్పటికైనను బయట పడకుండునా ? దీనితత్త్వము మనకుదెలిసినట్లు వాఁడు పసిపట్టెనేని దుర్యోధనుని నియోగము విఫలమగును. అట్లుకాక తొందరపడి దీనిని మనమే దహించిపోయినచో నక్కడ భీష్మ విదురులు కోపించితీఱుదురు. దానివలన కురుకులక్షోభము సంభవించును. పిదప కౌరవులు మనయునికినే వెదకుచు తిరిగి మనలనువంచించుటకే ప్రయత్నింతురు. కాన మనమునమ్మినట్లే యిందుండి పగలే వేఁటలాడపోవుచుందము. రాత్రి లాఁయుధ ములు తాల్చి యప్రమాదులమై మెలకువగ నుందుదము" అని చెప్పెను. వారంౘఱునట్లే యందు నివసించుచుండిరి.

ఇట్లుండ హాస్తినాపురమున విదురుఁడు దుర్యోధనుని దుస్తం

త్రిమంతయు దెలిసికొని మిక్కిలి నమ్మకముగల యొక ఖనకుని బిలిచి వానికి చెప్పవలసిన సంగతులు బోధించి పాండవుల యొద్దకు ప్రత్తెంచెను. ఆతఁడును పాండవులఁజేరి తన్ను నమ్మునట్లు విదురునిమాటలుకొన్ని తెలిపి మీరున్న లక్కయింటిని కొద్ది నెలలలో పురోచనుఁడుదహించి వేయును. కాన మీరిందుండ వలదు, దానికొకయుపాయము చేయుటకై నన్నంపియున్నారు. అనిచెప్పి లక్కయిల్లు వెలువడుటకై నెవ్వరెరుగకుండ నొక బిలముకావించి పాండవులకే దానిజూపి "మీరట్టి ప్రమాదము లేకుండ నీ సౌరంగమునుండి దాఁటిపొండు" అనిచెప్పి వాఁడు వెడలెను. భీముఁడా బిలమార్గమును పరిశోధించి బాగున్నదను కొని సమయము చూచుచుండెను. నాఁటినుండియు పాండవులు మిగుల జాగరూకులైయుండి నిరతాన్న దానముల తోడను, వ్రతములతోడను, సంతర్పణ సమారాధనలతోడను నైదాఱు నెలలు గడపిరి. గడవుదినమునాఁడు కుంతియు నాపురమందలి బ్రాహ్మణులను, పుణ్యస్త్రీలను పిలిచి ఇష్టమృష్టాన్నములు పెట్టి దేవతారాధనలు విరివిగ సలిపెను.

ఆనాఁటి యర్ధరాత్రిమున భీముఁడు మేలుకని పురోచను కంటె ముందుగ దానే యాలక్కయింటికి చిచ్చువెట్టి నిదురలో మునిగియున్న తమవారిని మేలుకొలిపి తమకుశలము ఖనకునికి తెలిపి యా సౌరంగమునుండి నడచివచ్చి యొకవనమున ప్రవేశించెను. అప్పుడు నిదుఃఖాలక, నడుపజాలక, శ్రమపడుచున్న

తనవారింగాంచి భీముఁడు జాలిపడి తొట్రుపడుచున్న తనతల్లిని తనభుజముల నిడికొని, విజయధర్మజుల నిరువురను జంకలనెత్తు కొని కవలను తనతొడలపై నిడికొని భీముఁడు నిజముగ వన చరభీముఁడై నడచుచుండ నాతని దాకువడిన వృక్షములుకూలు చుండెను. ఆతని పదములక్రిందబడి బొమ్మరాలు నుగ్గునూచ మగుచుండెను, ఆతనికా గమనవేగమందు మెఱక, పల్లము, ముండ్లు, గండ్లు చీకటి మున్నగున వేమియు కానవచ్చుట లేదు. అట్లాతఁ డాపద్బాంధవుఁడై, నిర్భయుఁడై తనవారి నెల్ల నాపద నుండి రక్షించుకొని పోవుచుండెను.

ఇఁక వారణావతమున దర్మతత్పరులగు పాండుకుమారు లను బాధించిన దుర్యోధనుఁడును. వారివంశమంతయు నీరీతి దహింపబడునన్నట్లు లక్క-యిల్లు మిగుల బీభత్సముగ కాలు చుండెను. కొంతవడికి తెల్లవారెను. ఈవార్త నగరమందెల్ల గవ్వున వ్యాపించెను. జనులుతండోపతండములుగ దర్శన కుతూ హలముట్టిపడఁ జనుదెంచిరి. అందుకొందఱు ప్రోగుగబడియున్న బుగ్గినటునిటు కదిపి "అందు ఒకవనిత తనయేవురు కొడుకులతో కాలి పడియుండ తదాకృతులు కాంచి వీరే పాండవులును గుంతియు ననుకొని మిగులఖేదపడిరి. మఱికొందఱు "అక్క-టా! మహాబలవంతులును, భగతవంశమునకు పేరుప్రతిష్ఠలఁ దేవలసిన వారును, శత్రుభయంకరులును, పరోపకార నిరతులు, నిర తాన్నదాతలు నగు పాండవులు నిష్కా-రణముగనిందు దహింప

బడిరి. ఎంతప్రమాదము వాటిల్లినదని విచారసాగర మగ్నులైరి. అంతయు జూచుచున్న ఖనకుఁడు పౌరులతో బాటు బూడిద నటు నిటు ద్రోయుచు వరులెఱుంగకుండ తనచేసిన బిలద్వారము కప్పి వేసి యచటజరిగిన యుదంతమును పాండవుల కుశల నిర్గమనము గూడ విదురున కెఱిఁగించెను. వారణావత వాసులందఱును నీదారుణము దుర్యోధను డొనర్చినదే యని తెలిసి మిగుల శోకించి తల్లితోపాటు పాండవులు మృతినొందిన విషయము ధృతరాష్ట్రున కెఱిగింప దూతలనంపిరి.

ఆవార్త నిండుసభలోనున్న ధృతరాష్ట్రుఁడు విని పాండవులఁగూర్చి పెక్కువిధముల పలవించువాఁడై బాలున నేడ్చెను. సౌబల దుర్యోధనాదులా దుర్వార్త వినియు విననివారైరి. అంతిపురములో గాంధారి మొదలగు దేవీజనుల యాక్రందనము లాకసమ్మంటిన వెడలెను. భీష్మాది కురువృద్ధులును బ్రాహ్మణులును, పౌరులునుగూడ శోకాక్రాంతులైరి. తత్త్వమెఱిఁగిన విదురుఁడు మాత్రము వారితోపాటు దుఃఖితునివలె నుండెను.

అట పాండవులును భాగీరథినిదాటి దక్షిణముగ పయనముసాగించి మిక్కిలి యాఁకలియు డప్పియుఁగొన్నవారై నడువజాలకయుండఁగా మరల నెప్పటియట్లుగ నందఱనెత్తుకొని వాయునందనుఁడు పవనవేగమున పోవుచు సాయంసమయమునకు ఒకమఱ్ఱినీడకు దమవారిని చేర్చెను. పిదప నాతఁడావృక్షమునెక్కి నీటిపట్టునకై చూచుచుండ నల్లంతదూరమున నొక

పద్మాకరము గోచరమయ్యెను. చెట్టుదిగి భీమసేనుఁడా క్షణము
ననే బయలుదేరి యాకొలను జేరి యందు హాయిగా స్నానము
చేసి కడుపునిండ నీళ్లుత్రావి తామరాకుల దొప్పలతో నీటిని
గ్రహించి తిరిగివచ్చుచుండ నంతలో సూర్యాస్తమయమయ్యెను.
క్రమముగా నాతఁడు తనవారికడకువచ్చెను. అప్పటికి సహోదరు
లందరును మిగుల నాయాసమంది యుండుటచే పైవుట్టములు
పఱచికొని తమబాహువులె తలగడలుగా గాఢనిద్రలో మునిగి
యుండిరి. వారినిఁగాంచినంతనే భీమసేను హృదయము తఱుఁగు
కొనిపోయెను. అప్పుడాతఁడు "అయ్యో! ముల్లోకములనేలికొను
సమర్థతగల సుకుమారుఁడీ ధర్మజుఁడు, నేఁడు ప్రాకృతునివలె
నీ బండరాతి నేలపై పరుండవలసెగదా! అన్నన్నా! ఆ మా
తల్లి కుంతీదేవిని చూతునా? ఎంత దుస్థితి? ఈ మహోత్కారాలు
కుంతిభోజుని ముద్దుకూతురు. వసుదేవుని చెల్లెలు. విచిత్రవీర్యుని
కోడలు. కౌరవకులభూషణుఁడైన పాండురాజుభార్య. మావంటి
బిడ్డలను కన్న వీరమాత, ఈమెకీనాఁటి కిట్టిగతిపట్టినది. మృదు
తల్పములపై శయనించియు నిద్రపోనొల్లని యీ కుసుమ సుకు
మారగాత్రి నేఁడీ యుక్కుసెనగలవంటి రాలు ప్రక్కలెమ్ము
లకు గ్రుచ్చుకొనుచుండ పైటకొంగు పఱచికొని డప్పిదేఱిన
మోములతో దిక్కులేనిదానివలె పడియున్నది. అకటా! ఇది
క్రూరమృగములతో నిండిన నట్టడవి యనియైన నెంచక తమ్ము
లందఱును గుఱ్ఱువెట్టి నిద్రించుచున్నారు. ఇట్టి సుఖనిద్ర నున్న

వారికి నిద్రాభంగ మొనర్పనేల ? వారంతవారు లేచి తా్రవు దురుగాక యని" తనకునిట్టి యిక్కట్టులు కలిగించిన ధార్త రాష్ట్రులనిందించికొనుచు నొక శిలాతలంబున కూర్చుండియుండ నొకజాము రాత్రి గడచెను. అంత తత్సమీపమున నొకపొద నుండి హిడింబుడను రాక్షసుఁడు వారినందఱినిఁగాంచి తన దేహము వికృతముగఁ బెంచికొని తనజుట్టంతయు విదిలిచికొనుచు, ఆవు లించుచు, నీలుగుచు వెలికివచ్చి "అమ్మయ్యా! ఈ బక్క మెక ముల నెన్ని తిన్నను నాకడుపు నిండుటలేదు. ఈ నీరసము తీఱుట లేదు. ఇంతకాలమునకు మానవమాంసము తిన సమయము వచ్చినది" అని యనుకొనుచు తనచెల్లెలగు హిడింబయను దానిని బిలిచియిట్లనియె "చెల్లీ! చూడుము. ఇన్నేళ్లైనది. మన యాశ్రమమున కెన్న డేని మానవులు వచ్చియున్నారా? వచ్చి నను ఇంత నిర్భయముగా గుండెలపై చేయినిడుకొని నిద్రింప గలరా ? వంటయింటి కుండేలువలె వీరు మననోటిలోనికి వచ్చి పడినట్టే. నీవువారిని పట్టిచంపి చక్కగ ముక్కలుగ తఱిఁగినాకు రుచికరమైన వంటకముచేసి పెట్టుము" అని పంపగ నదియును తొందరగపోయి యొక చెట్టుచాటుననుండి వారిని చూచెను. అంత నామెదృష్టికి మహాబలుఁడును, విశాలఫాలతలము, బొద్దు మీసములు గలిగి సింహసాహసుఁడైన భీముడు గోచరించెను. తోడనె యామె యాతనిపైమనసుకలిగి కామించి సమీపింపగా నాతడామె నవమానపూర్వకముఁగా "నీ వెవ్వతవు? ఎందుల

దానవు! ఇంతరాత్రి వేళ నిటకురాఁ గారణమేమి? దూరముగ బొమ్ము" అనెను. దానికామె సత్యముదాపక "ఆర్యా! నేను హిడింబుడను రక్కసుని చెలియలను. నాపేరు హిడింబ. నిన్ను కామించి యిటకువచ్చితిని. నాకు నీవేపతివి. అట్లు నీవును నన్ను తింతువేని నిన్నొక మహాప్రమాదమున నుండి దాఁటించెదను. ఏమందు" వనెను. దానికి భీముఁడు నాకు ప్రమాదమా ? నీవు దాఁటింతువా ! తులువా! నోరుమూసికొని పొమ్ము" అనెను. హిడింబయు "ఇది నాయన్న హిడింబు నాశ్రమము. ఆతఁడిందాది దేవతలనైన లెక్కసేయఁడు. మీరిటనుండి తప్పించుకొనుట మృత్యుముఖమున నుండి దాఁటుటే. వీరితో నీకేల? నీవు నాకు పతివై యిష్టోపభోగంబులందు నంగీకరింతువేని నీ ప్రాణములకు నా ప్రాణములడ్డు పెట్టియైన నిన్ను రక్షింతు" ననెను. భీముఁడామాటలకు మిగులకోపించి స్త్రీయగుట కనికరించి "ఓసీబేలా! లోకమందెవఁడైనను నీవంటి వగలాడికి చిక్కి నిధినిక్షేపములవంటి తల్లిని సోదరులను విడువనేర్చునే! నీ యన్న యిందాదుల లెక్కింపకున్నను నాముందు వాని యాటలు సాగవులే. వ్యర్థమైన మాటలేల? వానిని నీవుపోయిగప్పింపుము" అని పలుకునంతలో నాలస్యమునకు సహింపలేక హిడింబుఁడు కాలమేఘమువలెగర్జిల్లుచు, పటపటపండ్లు కొఱుకుచు, గ్రుడ్లెఱ్ఱ జేయుచు, అంగలార్చుచు "ఓసీ పిశాచీ! నేనేమి చెప్పితిని? నీ వేమిచేయుచుంటివి? ఇదిగో ఒక్కగుద్దుతో చచ్చితివి" అనుచు

హుంకరించుచు చెలియలిమీఁదికి పడబోఁగా నామె మిక్కిలి భయపడి భీమునిశరణుసొచ్చి యాతని మఱువున నిలుచుండెను.

భీముఁడును నార్తురాలగు నామెనుజూచి జాలిపడి "ఓసీ రక్కసీ! నీకభయ మిచ్చితిని. నీయన్నను నన్నును జూడుము. ఒక్క నిముషములో వీని పనిపట్టి యీవనమును నిష్కంటక ముగ నొనర్తును" అనుచు భీమసేనుఁడా హిడింబుని మెడపట్టి గెంటుచు "ఓరీ మనబలముల యంతరము చూతువుగాని. ఇచట నున్నవారి సుఖనిద్రకు భంగముకావింప నేల ? రమ్ము" అనుచు నల్పమృగమును సింగమీడ్చికొని పోవునటులు దూరముగా నీడ్చుచు వానిఱొమ్ము పిడిగ్రుద్దులతో గ్రుమ్ముచు, యుద్ధము నకు దలపడెను. వాఁడును భీముని చందమునకు వెఱఁగందుచు భూనభోంతరములు బ్రద్దలగునట్లు బొబ్బరించెను. ఆమహాధ్వనికి గుంతియు కొడుకులును మేల్కాని తమసమీపమున నతిమానుష రూపముతో నిలిచియున్న హిడింబనుగాంచి యీమె వనదేవ తయో సుర కామినియో యని విస్మయమందిరి. అంత గుంతి మెల్లగ నామెతో "నీవెవ్వరిదానవు? ఇట కేలవచ్చితి"వనియడుగ లోఁగడ వృత్తాంతమంతయు నామెకుదెలిపి "మీ కుమారుఁడును మాయన్నయు నల్లంతదూరమున యుద్ధ మొనర్చుచున్నారు" అని వచించెను. అంత పాండవులులేచి మల్లచఱచుచు తొంద రగ దమతమ ధనుర్బాణముల దీసికొని యాచోటికేఁగి యనుజ దనుజలగాంచి విస్మయమందిరి. అప్పు డర్జునుఁడు "భీమన్నా !

ఏమింకను నాలసించుచున్నావు? తూరుపు తెల్లవాఱుచున్నది. త్వరగా రెండు దెబ్బలతో వానిని యమపురికంపుము" అని ప్రోత్సహింప భీముఁడు తనగదా ఘాతమున నాతని తలపగులు నట్లు వేసెను. ఆదెబ్బతో నారక్కసుఁడు నెత్తురు క్రక్కుకొనుచు నేలగూలి మరణించెను. ఆ చిత్రవధగాంచి యందఱు నాతని ప్రశంసించిరి.

పిదప భీముఁడు తల్లితోడను అన్నదమ్ములతోడను కలిసి యథాస్థానమునకు వచ్చుచుండ హిడింబయు వారిననుసరించెను. అంత భీముఁడా మదవతినిగాంచి "ఓసీ! రక్కసీ! నీవుమాయలాడివి! మీ జాతినినమ్మరాదు. మా వెంటబడితివా? నీయన్నను కలియబోయెదవు. బుద్ధి తెచ్చికొని నీదారినినీవుపొమ్ము" అనిగద్దించి పలికెను.ఆమాటలకా యబల మిగులభయపడి వణంకుచుండ దాని దీనావస్థ కాంచి ధర్మరాజు "తమ్ముఁడా! స్త్రీలు అబలలు. అట్టివారియెడ నింతకాఠిన్యము పనికిరాదు. చంపవలసినవానిజంపి యే వైచితివి. అదివీరధర్మము. మనయందజేరియున్న నీమెను విడుచుటపాడిగాదు. దీనిని రక్కసయనితలపవలదు. నాకీమె యాఁడు రాలవలె దోచుచున్నది"అనెను ఆమాటలకు కొంత దిటవుగాని యామె "స్వామీ! నేనీ వృకోదరు నిమిత్తమై నావారినందఱను విడిచివచ్చితిని. నాకోరిక దీర్పనినాఁడు మీసన్నిధిని బలవంతముగఁ జచ్చెదను. నన్ను జేరదీసితిరా? మీకు వలసిన పనులను నిమిషమాత్రన చేయుదును. వలసినచో మిమ్మందఱను మోచి

కొని యెక్కడదింపుమన్న నచట తృటిలో దిగవిడుతును. నా పలుకులునమ్మి నన్ను మన్నింపుఁడు. మఱియునేనొక తపోధనుని దయచే నతీతానాగతముల దెలియు శక్తినందితి. మీనమ్మికకై కొన్ని యనాగతముల చెప్పెదను వినుఁడు. ఇచటికి దగ్గరగనే యొకసరోవరమును, నొక వనస్పతియును గలదు. ఆ చెఱువు నీరు గ్రోలినవారి కాకలిదప్పులుండవు. ఆ వనస్పతి సీతవాతా తపములనుండి రక్షించును. మీరందు విడియుఁడు. మీకడకు కృష్ణద్వైపాయనుఁడు రాఁగలఁడు" అనివచింప దాని యెఱుకకు వారందఱును విస్మయమంది "అన్నా! భీమా! ఈమె రక్కెస గాదు, మహా పతివ్రత. దీని పనుపుసేసి యాదరింపుము. ఓ సుందరీ! నీవును శుచివయి, యుత్తమస్త్రీగుణములుపూని మా భీమునకు మనఃప్రియమొనర్పుము. పగళ్లెల్ల మీ యిష్టానుసారము మీరుసంచరించి రాత్రులందు మాత్రము మాయొద్దనే యుండుఁడు" అని సెలవిచ్చెను. అపుడు భీముఁ"డమ్మా! నీయాజ్ఞ సిరసావహింతుఁగాని దీనియందొక్క కొమరుఁడు పుట్టువఱకే పొందుసేయుదును. ఇది నాకోరి" కయని వారలయెదుట బలికి యామెతో సుఖముగ కాలయాపన సేయుచుండెను.

అనంతర మందఱును ఆమె చెప్పిన సరోవరతీరమున నాశ్రమము కల్పించికొని క్షుత్పిపాసలుడిగి సుఖముగనుండ వారి యొద్దకు వ్యాసుఁడే తెంచి ముందు జరుగఁబోవు విషయములును కొన్నిధర్మములును, హితవులును దెలిపి మీరీ హిడింబను విడు

పతుఁడు. ఈమె భీమునకు వశవర్తినియై మహా బలవంతుఁడగు సుతుంగాంచును. అతడు మిమ్ములందఱను ఆపదనుండి దాటింప తోడుపడును” అని వెడలిపోయెను.

అట్లుండ గొంతకాలమునకు హిడింబగర్భవతియై మహా బలసంపన్నుడైన కొమరుని కనెను. అతఁడు పుట్టినవెంటనే యువకుఁడై శస్త్రాస్త్రవిదుఁడై కుంతికిని తండ్రులకును మ్రొక్కి వారుపనిచిన పనులొనర్చుచు నొక్కనాఁడు వారితో నిట్లనెను “తండ్రులారా! నేను నా పిశాచరక్షోగణముతో నా యిమ్ము లనుండెదను. నాయవసరమెప్పుడు కావలసినను మీరు నన్నొక సారిస్మరింపుడు. తోడనేవచ్చి మీకార్యము నవరించిపెట్టెదను. సెలవిండు”. అనుచు తనతల్లిని తీసికొని దక్షిణముగ వెడలి పోయెను.

పిదప పాండవులును గొంతకాలమట గడపి యటనుండి బయలుదేరి మత్స్యత్రిగర్త కీచకదేశములు దాఁటి యేకచక్ర పురమున నొక యగ్రహారమునకుఁ జేరికొనిరి. అందువారొక బ్రాహ్మణుని యింటనుండి జటాజిన వల్కలముల ధరించి బాపల వలె వేదములుచదువుచు భిక్షాశనముతో కాలక్షేప మొనర్చు చుండిరి. ఆయాగ్రహారికులును మాధుకరవృత్తినున్న వారిని గాంచి “అక్కటా! ఈమహాత్ముల నేమహారాజులుగనో కావిం పక దేవుఁడు భిక్షమెత్తికొనువారిగా చేసెనే!” అనిమిగుల విచా రించుచుండిరి.

అట్లు పాండవులేవురును నైదువీధులకుపోయి తెచ్చిన భిక్షాన్నము తల్లికి నివేదించుచుండ కుంతియు దాని రెండుభాగములుసేసి యందొక్కభాగము భీమునకుఁబెట్టి తక్కినవంతు తానును కడమ కొడుకులును భుజించుచు నెవ్వరికిని తమపొడ గానరాకుండ గడపుచుండిరి.

ఒకనాఁడు భీముఁడును గొంతియు నింటనుండ మిగిలినవారు భిక్షాశనమునకై పోయిరి. అప్పుడు వారువిడిసిన యింట నొక్కపెట్టునన్నార్తధ్వని మిన్నుముట్టెను. దానిని విని కుంతి "ఇంతకాలమై యీయింట సుఖముగనుంటిమి. యేపోరును పొక్కును నెఱుంగము. నేఁడీయింట రోదనములువినవచ్చుచున్నవి. కారణమేమైయుండునో? నాయనా! భీమన్నా! పరమోపకారియైనయీ బాపనికేమి కీడుమూఁడినదో. వీరిఏడుపుచూచి నెద్దియోపిట్టపిడుగుడు వీరి నెత్తినిపడినట్లు సూచితముగుచున్నది. లేకున్న నింతగా వీరు విచారింపనేల? వీరైనంతలో వీరలకుమనము ప్రత్యుపకృతి గావింపవలయును. నామనసు తుకతుకయుడికి బాధపడుచున్నది. నీవుపోయి కారణము కనుఁగొని వారిమనఃప్రియము సేయుము. నాయనా! చేసినమేలు మఱవకుండుట పుణ్యప్రదము. దానికి సమమైనప్రత్యుపకృతి పఱలకొనర్చుట మధ్యమము. ఉపకృతికమించిన ప్రత్యుపకారము చేయుట మిగుల నుత్తమముగదా!" అని పలికెను.

"అమ్మా! దీనికింతగా నీవుచెప్పవలెనా! నీవేపోయివారికి

దాఁపురించిన కష్టమేమో తెలిసి నాకు చెప్పుము. దీనికింత విచార మెందులకు? ఆపని యెంతకష్టతరమైనదైనను నేనుచేసి యాశిప్రి నకు సంతసముచేకూర్తును"అనినకుంతి వల్లెయని దుఃఖపరవశులై యేడ్చుచున్నవారల గాంచి యడుగనోరురాక యట చదికిలం బడెను. అంత నాయింటి యజమాని రోదనమధ్యమున "అన్ని దుఃఖములకును ఈ సంసారము నిలయము. ఇందు కాలిడుట మొలబంటి బురదలో నునుకుటే. ఈ యూరువిడి వేఱొక తావుచూచికొందమని నేనుము౦దే చెప్పితిని. ఈబిడ్డలతో ధర్మ పత్నితో నేనిప్పుడీయాపద కడచువెల్లు. ఆ దిక్కుమాలిన రక్క సునితిండికై నాయండయై, నాసంసారసాగరమునకు దెప్పయైన యీ నాధర్మపత్ని నెట్లు పంపనేర్తును? పోనీ యీ యాఁడుబిడ్డను నంపెదనంటినా ? ఈమెయందు దౌహిత్రలాభము గలుగగల దని కొండంత యాశ పెట్టుకొనియుంటిని. పోనిమ్మా చిన్నవాని నంపెదనంటినా ? అవ్వాల నా బ్రతుకంతయు వీనితోనే గదా యున్నది! ఇంకెట్టుచూచినను నేను మిగిలితిని" అని వాపోవు వానిగాంచి గృహిణి "అయ్యా! తెచ్చిపెట్టి పోషింపవలసిన మీరీపనికి పోనొల్లను. మీరు మిగిలినచో సంసారము దక్కును. ఈ బ్రతుకంతయు నెప్పుడో చచ్చుటకేగదా ! ఆ రక్కసునకేను భుక్తిగ పోయెదను. నన్నుదిక్కులేనిదాని గావింప తలఁపకుఁడు. మీరులేకున్న నేనొక్క నిమేషమైన నట్టిజీవితము గడుపనోపను. నేను బోయినను మీరు పునర్వివాహము చేసి

కొని మీరు దేవపితృక్రియలు నాచరింపనగును. నాకట్టిస్థితి కలుగదు. నన్ను పోనిండు" అని యామె మరణింప సిద్ధముగ నుండెను.

ఆమె మాటలువిని యాతనికూతురు "అమ్మా! నేనెంత కాలమున్నను పరులసొమ్మునే గదా! మీయింట నుండుదానగానుగదా! ఎప్పుడో పరులకొసంగనేల? నన్నిప్పుడే యిచ్చితి మనుకొనుఁడు. నేనీ యసురునికి భోజనమయ్యెద. మీకు నావలన గలుగు దౌహిత్రిలాభముకన్న మీరుభయులు, తమ్ముడును సురక్షితముగనున్నచో ననేక పుత్రపౌత్రలాభము లందవచ్చును. దానిచే మనవంశమునిలుచును." అని తల్లిదండ్రులపై బడి యేడ్చుచుపలికెను.

వీరి యేడుపులు విని బాలకుఁడును ఒకకఱ్ఱ చేతబట్టి "నాన్నగారు! నేనారక్కసుని నిముషములో చంపి వచ్చెదను. ఈకఱ్ఱతో నొక్కదెబ్బతీసినవాఁడు చావకుండునా? మీరిందఱేల వృధాగాఁ నేడ్చెదరు!చూడుడు" అని తన తొక్కుపలుకులతో బలుకుచుండఁ గొంతవడికి వానకురిసి వెలిసినట్లు వారలరోదనములు కొంతచల్లారెను.

కుంతియు విషయమస్పష్టముగ దెలిసి "అయ్యా!మీరేల యేడ్చుచుంటిరి? ఇప్పుడంతగవచ్చిపడిన ప్రమాదమేమి? ముక్కుమూలములు తెలుపకుండ విచారించిన నెవ్వరేమి చేయగలరు? నేను చేయగలిగినంత చేసెదను. విషయమేమియో తెలుపుడు"

అనెను. దానికిగృహపతి "అమ్మా! ఏమనిచెప్పుదును! ఇదిమనుజ యత్నముచేతీఱునది కాదమ్మా! ఐనను చెప్పెదను. తల్లీ! ఈగ్రామము కామడదూరమున యమునానదీ గహ్వరమున బకాసురుఁడనునొక్క పొలసుదిండి గలఁడు. వాఁడీ యూరిపైఁబడి దినదినముమాఱి మసఁగినట్లు జనులజంపి తినుచుండ వానికిజడిసి ఇల్లిల్లు వరుసగ నొక్కమానిసిని, రెండెనుబోతులను కట్టిన బండిపై మాంసాహారమును నీకిడుదుము. మా కిట్టి సంఘమరణము లేకుండ జేయుమని" వానిని ప్రార్థించిరి. వాఁడును ఎనుబోతులతోఁగూడ వానిని, భోజ్యములను మ్రింగి యీయగ్రహారమునకితరులవలన భయము లేకుండ గాపాడుచుండును. ఈ నాటిరాజు కూడ వానిని జయింపజాలక వానికి దాసుఁడైనాఁడు. రాజరక్షితములుగాని యిట్టి కుగ్రామముల నున్నను, అడవులలో నున్నను నొక్కటేగదమ్మా! మాకడనుండి యెట్టి పరిపాలకులును ఒక్కనాఁడైన నొక్క యీకుపాకునైన గ్రహించియెఱుఁగరు. ఈపాపాత్ముడు మనుజులనే సుంకముగ గ్రహించుచున్నాడు. చిరకాలమునకు నీ యిలువరుస మాకు వచ్చిపడినది. అమ్మా! యేమని చెప్పుకొందుము" అని విచారించు బ్రాహ్మణునితో కుంతి యిట్లనెను.

"అయ్యా! ఇదియేగదా మీకువచ్చిన కష్టపాటు? ఇందులకై విలపించుట మానుఁడు. దీనికొక్క యుపాయ మున్నది. నీకు కొడుకొక్కడు వాఁడును కడుబాలుఁడు. వాఁడు

బలితీసికొనిపోవ సమర్థుఁడు కాఁడు. నా కైదుగురు కొమరులున్నారు. నీకొఱకై మావారిలో వాఁడొక్కఁడు బలిగొనిపోవ సమర్థుడున్నాఁడు. తప్పక నేఁజెప్పి పంపెదను" అన్నంతనే యామాటలకాతఁడు చెవులురెండును మూసికొని "తల్లీ! ఎంతమాట సెలవిచ్చితిరి? అతిథినై మాయింటికివచ్చిన వాని నీతుచ్ఛ జీవితములు నిలబెట్టుకొనుటకై యొక రక్కసునికి దిండిగపంపుటా! ఎంత దారుణము? నా మెడకీ బ్రహ్మహత్యాపాతకము చుట్టఁ దలచితివా? వద్దుతల్లీ వద్దు. అంతకన్న నామరణము సుకరము. ధైర్యము సెడినవానిని, అతిథిని, అభ్యాగతిని, భయస్థుని, శరణాగతు చంపింపఁబూనిన వాని కిహపరములుండవు. ఐనచో నా బలవన్మరణము దోషముకాదా? యందువేమో? అది యనతిక్రమణీయమైనపు డేమి చేయుదును? అదియు పరులుచేయుచుండుటచే నాకా పాపమంటదు. నీతనయుఁడు వలద"నెను.

"బ్రాహ్మణోత్తమా! అట్లుగాదు. నేనును నీవంటి బ్రాహ్మణుఁడు చచ్చుటకొల్లక నాకొమరు నంపదలచితిని. మఱియొక రహస్యము. మావానిని చంపుట యారక్కసునికి చేతఁగాదులే. అట్టి రక్కసిపురువుల నాతఁడీవరకే నల్లులరీతిని నలిపివేసినాఁడు. లేనిచో మగబిడ్డడు చేదై సమర్పించుటలేదయ్యా! వీఁడు మహాబలసంపన్నుఁడు. మంత్రసిద్ధిగలవాఁడు. చూడుము" అని భీముని పిలిచి, బిడ్డా! నీవీ బాపనయ్యకు గాపురించిన యాపదఁబాపి నాకానందము కలిగింపుము" అని యానతిచ్చెను. భీముఁడును

సంతోషపురస్సరముగ నంగీకరించెను. బ్రాహ్మణ కుటుంబమును పరమానందమంది యుండెను.

అంత కొంతతడవునకు ధర్మార్జున నకుల సహదేవులు వచ్చి చిదానంద పూరుషునివలెను, క్రొత్త పెండ్లికొమరునివలె నున్న భీముని గాంచి విస్మితులగుచుండ ధర్మరా జిట్లనెను. "అమ్మా! ఇదేమమ్మా! మనభీముఁ డిట్లున్నాడు. ఈతని వరుస జూచిన నీదినమున నదొకరీతిగ నున్నదే! ఈతని కెవ్వరితోనైన యుద్ధము తగిలినదా యేమి? మీరు పంపుచున్నారా? తానేపోవు చున్నాఁడా!" అనిప్రశ్నింప నామెయు జరిగినదంతయు నివేదించెను. దానికాతఁడు మిగుల దుఃఖించుచు "అమ్మా! ఎంతసాహస మొనర్చితివి? పరులకై తమకొడుకులనుబలిపెట్టు వెఱ్ఱితల్లులుందు రటమ్మా! ఇది లోకాచార విరుద్ధము కాదా! ఐనను భీముఁడు నీకు విడువఁదగిన కొడుకటమ్మా? ఈ సాహసునివలననే గదా మనమా లక్కయిల్లు వెల్వడి బ్రతుకనందితిమి. గాఢనిద్రలో మున్గియున్న మనలకెల్ల నాఁటిరాత్రి నట్టడివిలో నాబలురక్కసిని జంపి ప్రాణభిక్షపెట్టిన వాఁడీతడే కాదటమ్మా! ఈతనిగాంచియే గదా యాకౌరవులు నేటివఱకుకృశించి కడివెడునీళ్ళకు నిత్యము నేడ్చుచున్నవారు? వీనిజంపుట కేవారు నిద్రాహారములుమాని పెక్కు పన్నాగములు పన్ని తపించిపోవుచున్నారు. ఇట్టి మహా సత్త్వుని బ్రాహ్మణార్థముగా నొసంగ నీకడుపెట్లు కరుగకుండె నమ్మా? నీకేమైన మతిపోయియుండవచ్చును" అని పలికెను.

కుంతియు "నాయనా! నాకేమియు మతిభ్రమలేదు. నే నంత తెలియక యీతని పంప నంగీకరింపలేదు. ఆతని శక్తి నాకు తెలియును. వీఁడు వజ్రకాయుఁడు. ఈతఁడు పుట్టిన పదవ నాఁడు నాచేతులనుండి జాఱి యొక్కకొండపై పడినాడు. నేను మిగుల తత్తరపడితిని. కాని వీనిదేహముతగులుటచే నచటికొండ రాళ్ళన్నియు పిండిగుండమైనవి. వీఁడుమాత్రము కసిగందలేదు. వీఁడు తప్పకవానిజంపి రాఁగలఁడు. వానికై నీవింతయు విచారింప నవసరములేదు. మనకు సుఖనివాసమిచ్చి గౌరవించిన యీబాపని కింతకన్న ప్రత్యుపకృతి సేయు సమయము ముందు రానేరదు. ఊఱకుండుము" అని సమాధానమిచ్చెను. ధర్మజుఁడును ఆమె కారుణ్యబుద్ధికిని, ధర్మచిత్తమునకును సంతసించి భీముఁడు వోవ నంగీకరించెను.

అంత భీమన్నయు పెండిలికి తరలురీతిగ నడుముకట్టిలేచి యాయింటివారి కిట్లనెను. "ఓయీ! నేను నిత్యముతిను భోజన మొకడొక్కనే నింపించుటచే మిగుల చిక్కియుంటిని. మీకు వీలున్నవో నాకువలసినంత యాహారము సమకూర్పుడు. అట్లయినచో నాసీరసము తీరికావలసిన శక్తివచ్చును. సులభముగ రక్కసునొక్క గుద్దుతో పరిమార్చి మీయూరికింక నా శని బాధలేకుండ జేయుదునన్నంతనే వారును మహానంద మంది యందఱును గలిసి పలుతెఱఁగుల పిండివంటలు, పప్పు, కూరలు అన్నపురాసులు, నేతికుండలు, పాలు, పెఱుగు, బెల్లము

మున్నగునవి భీమునికి సమర్పింపఁగా నాతడన్నిటిని కలియఁగలిపి తాళఫల ప్రమాణముగ ముద్దలుగట్టి గిరిగహ్వరమువంటి తన నోటనిడికొనుచు సుకరముగా, సుఖముగా నా పదార్థములను భుజించెను. పిదప పలసినన్ని నీరక్షీరములదాగి బే, వని త్రేన్చి సంతృప్తుఁడై భక్ష్యాన్నపూర్ణమైన బండినెక్కి "జాపరమేశ్వరా" యని దక్షిణాభిముఖముగ వెడలెను. అట్లాతఁడు బకాసురుఁ డున్నచోటికి చని దుర్గంధభూయిష్ఠమైన యచ్చోటు సమీపింప లేక దూరముగనే బండివిప్పి వానిని రావలసినదిగా బొబ్బరించుచు పిలిచెను. వాఁడు వచ్చునంతలో నూరకుండనేలయని యాబండి లోని పదార్థములను కలిపికొని కవ్వకవ్వన తిన మొదలిడెను.

భీముని కేకలు విని బకాసురుఁడును "ఎవఁడురా వీఁడు. ఇంత వేళతప్పించి భుక్తి తెచ్చుటయేగాక, ఎక్కడనుండియో బొబ్బరించుచున్నాఁడు! ఈమనుజాధముఁడెవఁడోనన్నెఱుఁగఁడు. ఒక్కసారి నాపస చూపెదను" అనుచు నోడుగఱచి, యాఁకటి తాఁకునకు తాళలేక యాకసమెత్తు తన దేహమును బెంచికొని మహాభయంకర రూపముతో భీముఁడున్న దెసకు రెండంగలలో వచ్చెను. వచ్చుసరికి యినుపతలుపువంటి తన వెన్నుపట్టి వెలికిడి బండిలోనిపదార్థము బూరిబుగ్గలతో గుటుకుగుటుకున దిగ మ్రింగుచు జంకుగొంకులేకున్న మానవునిగాంచి "ఓరీ ! నర పశువా? నాకొఱకైన కూడు నీవేల తినుచుంటివిరా? ఈ పుర వాసులకు మరల పోఁగాలము సమీపించెను. కాబోలును

చూడు నా దెబ్బయని వెనుకగవచ్చి భీముపీఁపున నొక్కపిడిగుద్దు వైచెను.

దానికి భీముఁ డదరక బెదరక వానివైపేని కన్నెత్తి చూడక, పల్లెత్తుమాటన్నైన నాడక యెప్పటియట్లు తనపని తానొనర్చుచుండ నది పనిగాదు. వీనిరీతి నిత్యము వచ్చువారివలెలేదు. అని యనుకొని యొక మహావృక్షమును పెకలికొని భీముతోఁ దలపడెను. వాఁడు వచ్చుసరికి భీముఁడు బండిలో మచ్చునకొక్క మెతుకైన లేకుండచేసి యనంత బలసంపన్నుఁడై ప్రళయకాల యమునివలె బండిదిగనుఱికి దండలుచఱచుచు నఱచుచు "ఓరీ! రాక్షసా! పాపమనక హింసకుజంకక చిరకాలమునుండి మనుజమాంసము తెగదిని గుంజువట్టియున్నావు. ఈ యమాయకులైన గ్రామస్థులనెందఱిని నీపొట్టఁ బెట్టుకొన్నావో? ఆ మదమంతయు నేఁడు క్రక్కించెదను! నీగర్వమడగించెదను. నిన్ను యమపురికేఁగించెదను" అనుచు నొకవిశాల సాలవృక్షమునూడలాగి దానితో వాని చిదుకమోదిన నాతఁడును దనచేతి వృక్షముచే దానిని భగ్నముచేసెను. అంతనిరువురును మల్లయుద్ధమునకు దిగిరి.

అట్లు వారొకరితో నొకరు పెనఁగి పట్టుకొనుచు, గెంటుకొనుచు, గుద్దుకొనుచు క్రిందుమీఁదులగుచు, మోఁకాలి తాఁకుల మోఁదుకొనుచు, కలహించుచుండ నచటివృక్షములు, తీగలు, నలినలియయ్యెను. అచటిరాలెల్ల నిసుముగా మాఱిపోయెను. వారి హుంకార టంకారములు, వారి బుజముల

యప్పళింపులు, వారి పిడికిండ్లపోటులు, వారి బొబ్బరింపులు వారి పాదఘట్టనలు, గుభీలుగుభీలు, మనుచుండ నాపురజను లందఱును గుమిగూడి దూరమునుండి కాంచుచుండిరి.

అప్పుడు భీముఁడా యసురుని మెడయు కాళ్ళును రెండు చేతులఁబట్టిపీపుపైనొక్క మోకాలిపోటుపొడిచి వేణుదండమును వలె విరిచివైచెను. అంతనాతని కళేబరము నవద్వారములనుండి నెత్తురు వరదలై ప్రవహింప నొక్కకేకపెట్టి యాతఁడు ప్రాణ ములు విడిచెను.

ఆకేకవిని వాని జాతివారగు పెక్కురు రక్కసులు వఱ తెంచిరి. వారినిగాంచి భీముఁడు "ఓరీ! ఈపై నెన్నడును మీరు మనుజుల దినవలదు. నా ఆనదాటి యెవ్వఁడేని తిన్నట్లు నాకు దెలిసెనా? మిమ్మందఱ నొక్కముద్దగాజుట్టి నమలి మ్రింగెదను. జాగ్రత్త" అని, వారలకెల్లఁ జాటిచెప్పెను. అంత నారక్కసులు భయపడి యాతనిమాట కొడఁబడి నాటినుండియు నా యేక చక్రపురవాసుల కుపద్రవముచేయ వెఱచిరి.

అట్లు భీముఁడు బకుని రూపుమాపి యాపని జగద్విదిత మగుటకై వాని కళేబరమును జుట్టువడి బఱబఱ నీడ్చికొనివచ్చి నగరద్వారముకడ విడిచెను. ఎక్కడలేని జనము నా దృశ్యము చూచుటకై యహమహమికతో వచ్చి మహాకోలాహలము చేయుచు, ఇట్టి దేశోపకార మొనర్చి సంఘము నుద్ధరించిన భీముని వేనోళ్ళ పొగడిరి.

భీముఁడు మెల్లగ దనవసతికి జేరి తల్లికిని నన్నదమ్ము లకును నా వృత్తాంత మెఱిగించి వారి నానందపఱచెను. అంత నాయూరిలోని పెద్దలందఱును "ఎవఁడో యొకమంత్రసిద్ధుఁడట. బ్రాహ్మణుఁడఁట. అసాధ్యబలుఁడఁట, అవలీలగ బకాసురుని జంపినాఁడట, లెండు" ఆమహాత్ముని దర్శింపవలెనని "తండతండ ములుగవచ్చి యాతనిగాంచి నమస్కృతములర్పించి పోవుచుండిరి. ఆయింటివారును కుంతిని సమీపించి "అమ్మా! నేఁటి మాకష్ట ములెల్ల గట్టెక్కినవమ్మా! తల్లీ! ఆపద్బాంధవునివలె నీ కొడుకు చేసినమేలు మా జీవితములలో మేము మఱువఁజాలము. ఈ లోకహితమొనర్చిన మహాత్ముఁడు చిరకాలమాయురారోగ్య ములంది సుఖముండుగాక యని పదేపదే కొనియాడుచు, అట్టిపుత్రులగన్న కుంతికి పాదవందనము లాచరించుచు నెవరి తెన్నునవారుండిరి.

---

# శృంగభంగము

తోడినూనవులతో కలసిమెలసి యుండుటకే జనులు కోరుచుందురు. కిరి జీవితములు సంఘమందలి పరస్పరసాహాయ్యమున కలవాటుపడినవగుటచే సాంఘిక జీవితములనబడును. ఇందలిముఖ్యధర్మము సహవాసము. దీనికంగభూతమైనది మైత్రి. దీసనే మనము సఖ్యము, స్నేహము అనుపదములతో వ్యవహరింతుము.

ఏడుమాట లాడుటచే నుత్తములకు సఖ్యముకుదురును. సమమైన ఆకారములు అలవాటులున్న వారికే సఖ్యము సరిపడును. అనునార్యోక్తులు పూర్వమునుండియు మనలో వ్యవహరింపబడుచున్నవి. వీనినిబట్టి యుత్తములతో యుత్తములకును దుష్టులతో దుష్టులకును సహవాసము సంభవించుచుండునని నిర్ణయింపనగును. "తేటయంతయు నొకవైపు తెట్టెయంతయు వేరొక వైపు" అన్న జాతీయమిా విషయమునే సూచించును.

కాని దీనికి వ్యతిరేకముగా "సహవాసము వలననే గుణదోషములు సంక్రమించుచుండు"నను సూక్తిగూడగలదు. అనగా దీనిభావమిది. కలిసినయుభయులలోను నెవరిబలమధికమైన వారు రెండవవారిని తమవలె కావించుకొందురు. ఇందొకడుత్తముడు వేరొకడ నుత్తముడును. "ఆరు నెలలు సావాసము చేసినచో వారు వీరగుదురను" అను జాతీయమిావిషయమునే సూచించుచున్నది.

ఇఁక నుత్తముఁ డుత్తముని సావాసమువలన చందనముతో కలసిన పచ్చకప్పురమువలె వాసించును. ఇట్టివారి మైత్రి కెట్టిప్రయత్నములును నుండనక్కరలేదు. ఇది దినదిన ప్రవర్ధమానమై కొనలుసాగి చిత్తశాంతినిగూర్చి మానవుల యుత్సాహశక్తిని బలపఱచి వారివారి జీవితముల నెట్టి యొడిదుడుకులకును పాలుకాకుండ కాపాడును. ఈ సావాసము పరస్పర కష్టసుఖముల పంచికొనుటయేగాక యవసరమగుచో ప్రాణము నర్పించుటే పరమావధిగ నుండును.

ఇఁక దుర్జనునకు దుష్టసాంగత్యము గంజాయితో కలిసిన భంగుపత్రివలె తలత్రిప్పు కలిగించి క్రిందుమీఁదు కానరాకుండ జేయును. ఇట్టి సహవాసఫలము వారితోపోక వారి వంశమునకును, సంఘమునకును గూడ సంక్రమించును.

దుష్టుఁడు తనకులోబడిన సజ్జనుని ప్రోత్సహించి దురాలోచనలవాసికి దింపును. దురాలోచనము దుష్కృత్యములను చేయించును. దానితో మనుజజీవిత మపకీర్తిపాలగును. సంఘమట్టివానిని గాంచి ఏవగించికొనును. ఆతఁడిహసుఖములకు దూరుడగును.

ఈక్రింది బూర్వగాథ పైనీతినే బోధించుచున్నది.

కౌరవులలో దుర్యోధనుఁడు రాజైయుండుటచే నాతని యందందఱును గౌరవాదరములతో నుండిరి. ఈతని తమ్ముఁడు దుశ్శాసనుఁడు. ధృతరాష్ట్రుని సంతతిలో వీరిద్దరే ప్రధా

నులు. శకునియు, కర్ణుఁడునుగూడ భారతమున ముఖ్యపాత్రలు. దుర్యోధన దుశ్శాసనుల కీయిరువురితో సహవాస ముండుటచే నీనల్వురును మిత్రులైరి. వీరికే దుష్టచతుష్టయమని వ్యవహారము. ఏ వ్యవహారముననైన నీనలువురును పాల్గొందురు.

దుర్యోధనుఁడు శకుని సాయమునొంది ధర్మరాజుతో కపటద్యూతమాడి వారి యావద్రాజ్యమును గెలిచెను. దీనికి కర్ణుఁడుగూడ చక్కని సలహాల నొసంగెను. పిదప పాండవులను వీరనేక విధములపీడించి వారి నడవులపాలు చేసిరి. సూతపుత్రుఁడగు కర్ణుఁడన్నను, మాయావియగు శకునియన్నను రాజునకమితమగు వాత్సల్యము. క్రమక్రమముగా వీరి సహవాసము బలపడినది. దుర్యోధనుఁడు కర్ణశకునుల చేతిలో కీలుబొమ్మవలె నైపోయినాఁడు. ఎట్టి స్వల్పకార్యమునైన కర్ణునికి దెల్పక రాజు చేయఁడు. అతని కుటుంబములో సర్వాధికారములు, పెత్తనములు కర్ణశకునులవే.

అది సాయంకాలము. సరదాగా నల్వురును వాహ్యాళికై కోటలోని పూలతోటకేగిరి. ఏదో ప్రసంగముదెచ్చి కర్ణుఁడు దుర్యోధనునితో "రాజా! పాండవులిపుడు పడరాని పాటులు పడుచు తినతిండికిని కట్టగుడ్డకును మొగమువాచి మనద్వైతవనమున నొకచెఱువుకడ బికారులవలె నున్నవారట. మనమిప్పుడు సమస్తసంపదలతోఁ దులదూగుచున్నాము గదా! ప్రజలందఱును నీపాలనమందు మిక్కిలి మక్కువగలవారైరి. కాన మనము

మన రాజశ్రీవియు, మన భోగభాగ్యములును, మన సంపత్సమృద్ధియు పాండవులకన్నులకు మంటకలిగించునట్లుగా ప్రవర్తించివారి నూఱింపవలదా? స్నేహితులను సంతోషపెట్టుటకును, శత్రులనేడిపించుటకే గదా యీ సంపదలన్నియును. మనలను మన సంపదలను గాంచి పాండవులును, ద్రౌపదియుగూడ కుమిలి కుమిలి బాధ పడకమానరు. అట్లు వారేడ్చుచుండ వారి మోములొకసారి మనము చూడవలదా? ఇంతకంటె నీకుధన్యత యేమున్నది ? అందులకై మేమందఱము సాహసపడెదము. ఏమందువు ?" అనెను.

కర్ణుని పలుకులు దుర్యోధనాదులకు కర్ణపేయములైనవి. వెంటనే రాజుతల పంకించుచు "మిత్రమా! నాకును నిట్టి యభిలాషలేకపోలేదు. దానికి నీవిపుడు దోహదమిచ్చితివి. కాని తండ్రిగారంగీకరించుట యెట్లాయని నా సందేహము. పాండవుల యెడ నెప్పటికప్పుడాతఁడరయుచునేయున్నాఁడు. మనకోరిక వెలిబుచ్చినంతనే యాతఁడనుమాన మందిటేఱును. మఱియు పాండవులు తపశ్శక్తి సంపన్నులనియు, పరాక్రమవంతులనియు మాతండ్రిగారికి గొప్పనమ్మిక. అది యటుండ నతనికడ గద్దెవైచికొనియుండెడి యీవిదురుఁడు సర్వదాపాండవుల గొప్పలుగోరంతలు కొండంతలుచేసి పలుకుచుండును. మనకోరిక యాతని చెవినిపడి నంతనే యాతఁడు మాతండ్రిగారి మనసు విరిచివేయగలఁడు. కాన కార్యమునాను కూలమగు దారి చక్కఁగ మాము

య్యగారును మీరును ఆలోచింపుడు” అనెను.

రాజా! ఆలోచనకిదంత పెద్దరాచకార్యముగాదు. ద్వైత వనములో మన గోకదంబములున్నవిగదా! వానికి క్రూరమృగ ముల బాధ మిక్కుటముగ నున్నదని అచటి మన పాలేరులంద ఱిచేత మీతండ్రియెదుట గోలబెట్టింతము. దానితో నీ విదురుఁ డును గిదురుఁడు నేమి చేయుగలరయ్యా! మీతండ్రి గోరక్షణకై తప్పక నిన్ను పొమ్మనితీఱును. తోడనే చల్లగా మన యుబలా టము మనము నెఱవేర్చికొనవచ్చును. అని కర్ణుఁడనెను. శకుని దుశ్శాసనులీయుక్తి బాగున్నదని తలూపిరి. పిదప రెండు మూఁడు దినములు గడచిపోయినవి.

అనుకొన్న పద్ధతిగా పసులకాపరులు వచ్చి ముసలి రాజుకు నమస్కరించి “బాబయ్యా! దండములు” అని వంగివంగి సలాములుచేసి కర్ణశకునులు నేర్పినరీతిగా వారాడవలసిన మాట లన్నియు పెద్దరాజునకు విన్నవించిరి. ఆపలుకులువిని సమయము నకై వేచియున్న కర్ణుఁడును శకునియు నెదురుగావచ్చి ధృత రాష్ట్రునితో “దేవా! ఈపసులకాపరులిట్లు మొరలువెట్టుకొనుట కిది మూఁడవసారి. ఈ స్వల్పవిషయము మీ యొద్దకురప్పింపనేల యని లోగడ మేమే సద్దిచెప్పి పంపివేయుచు వచ్చితిమి. ఈ సారి వీరిమాటలు వినగా తప్పక వేటాడవలసిన యవసరము కానుపించుచున్నది. గొల్లలందఱును గొల్లుగొల్లు మనుచుండ నెన్నిసారులు మన మూరకుందుము. ఇందులకై మన చిరంజీవిని

పంపుడు. లేనినాఁడు గొల్లలకును గోవులకును గూడ నష్టము తప్పదనెను. అందులకు ముసలిరాజు "నాయనా! నీవు చెప్పినది నిజమే. పశుసంపదను రక్షింపవలసినదే. వాలుమెకములను వేటాడవలసినదే. ఈరెండును మనకు తప్పనిపనులే. కాని యచటనే పాండవులు నివసించుచున్నారు. వారుమహాశక్తిసామర్థ్యములు సంపాదించి నివురుగప్పిన నిప్పులవలె నున్నారు. అట్టి వారినిచూచి మీరు చులుకనచేయుదురు. మీకింకను కుఱ్ఱదనములుపోలేదు. మున్ను గూడ మీచేతవారు పలుబాములుపడినారు. వారిమనసులకు మీరు నొప్పి కలిగించినప్పుడు మిమ్ము వారును నొప్పించుటకై యత్నింపవచ్చును. అట్టితఱి మీరొకరి నొకరు చూచుకొన్నచో నేవేని ప్రమాదములు వచ్చుటకవకాశ మున్నది. కాన మీరట కేఁగుటకు నేనంగీకరింపను" అనెను.

ఆ మాటలాలకించి శకుని "ఆర్యా! మేము పాండవుల నెఱుఁగమా వారు మమ్మెఱుగరా ? వ్యర్థముగా మేము వారి నేల యవమానింతుము? వారస్త్రశస్త్రవిదులై పౌరుషవంతులే యగుదురుగాక. మాదారిని మేము పోవునప్పుడు వారి పౌరుషములు మమ్మేమి చేయును? ఒకవేళ వారినవహేళన మొనర్తు మేమో యనుకొనుఁడు. ధర్మరాజున్నాఁడు గదా! అతఁడు తన ప్రతిన నతిక్రమించునా ? కలహము కలుగునంత వఱకాతఁడు రానిచ్చునా? ఇవన్నియు వ్యర్థమగుమాటలు. కలలోనిమాటలు నిజముచెప్పుచున్నాను. మీరునమ్ముఁడు. మేము వేటాడవలె

నని సరదాపడుచున్నాము. దానికీ గోరక్షణ వ్యాపారముసాయ మైనది. మా ముచ్చటలు తీర తామనుజ్ఞనొసంగుదురేని మన యవసరము తీర్చికొని మరలివత్తుము” అనెను.

ఆమాటలకు కొంత తడవాలోచించి తలపంకించి ముసలి రాజు“అట్లైన మీరందఱును జాగరూకులై ప్రవర్తించికార్యము సరిదిద్దిరండు.అట నాలస్యముచేయరాదు.పాండవులున్న హద్దులు మీరుత్రొక్కవలదు. అచ్చట లేనిపోనిచిలిపిచేష్టలు చేయవలదు చెప్పితినిగదా! మీరందఱును సురక్షితముగా మరలివచ్చువఱకు నా ప్రాణములు గూటఁబడవు. బహుభద్రమునుఁడీ” అని పిసిని గొట్టుచేతినుండి ధనమువలె ఎట్టకేలకు తన యంగీకారము తెలి పెను. అదివిని దుర్యోధనాదు లుప్పొంగుచు తమపాచిక పడినది గదా యనుకొని యీవార్త నగరమందెల్ల చాటింపించిరి. పుర జనులుగూడ ముచ్చటపడుచు మేమును వత్తుమనుచు ప్రయాణ సన్నాహములు చేయుచుండిరి.

అనుకొన్న రీతిగా దుర్యోధనాదులుగూడ విలువైన భూషణాంబరాదులు సమకూర్చుకొని యెవరికివారు వేర్వేరుగ నందమైన గుఱ్ఱములపైనను, నేనుఁగుల మీదను పల్లకులలోను, రథములయందును పయనములు సాగింప సన్నద్ధులైరి. వారివారి రాణులును, భార్యలును, మిత్రముల ఁోలికులను, బంగరు గూటిపల్లకీలను నెక్కి బయనమైరి. పౌరులు వారివారి స్థితుల ననుసరించి ప్రభువులొసగిన వాహనములను, బండ్లుమున్నగు

వానినెక్కి సిద్ధపడియుండిరి. వంది వైతాళికులు, విటవిదూషకులు వేలకొలంది దాసదాసీజనములు, వేశ్యలును, పెండ్లికై తఱలు పెండ్లివారివలెమహోత్సాహముతో ననుగమించిరి. ఇట్లాయాత్ర రెండుక్రోశములమేర జనసమ్మర్దముతో నిండి గోదావరీ ప్రవాహమువలె జరగుచుండెను. అట్లు వైభవోపేతముగా వారు రేయుంబవళ్ళు ప్రయాణములు చేయుచు వేళపట్టులకు తగిన తావులందు విడియుచు నెన్నోపర్వతములు, విపినములు, నదులు దాటి తమ యాలమందలున్న ద్వైతవనము ప్రవేశించిరి. అందన్ని వసతులుగల యొక తావున వేలకొలఁది పటకుటీరములు నిర్మించికొని పెద్దసందడితో నుండిరి. సుయోధనుఁడును తమ గోధనములనుగాంచి పసులకాపరులవలన మందలందలి విశేషములు, గోజాతులు, పసిని విశేషములు గ్రహించుచు, పాల పెరుగులలో మునిగి తేలుచు, వెన్న నేతులతో, జున్నుఁబాలతో ముంచెత్తువేయు గొల్లలకానుకలను గ్రహించుచు మిగులసంతస మందుచుండెను. అచలునాముష్టచతుష్పాదుముయొక్క ప్రవృత్తులు గడియగడియకు, గంటగంటకు దినదినమునకు నూతనత్వమును ప్రదర్శించుచుండెను. వారి విఱ్ఱవీఁగుడు దనమునకుగాని, వారి కేరింతలకుగాని, వారి వేషభాషములకుగాని యొకహద్దుకానరా కుండెను, వారి రాజఠీవులు, వారి నిరంకుశవర్తనముల నడ్డు వారు లేకుండిరి. అది చూడవలెనేగాని చెప్పవీలుపడనిది.

ఇట్లుండ నొకనాఁడు కర్ణ దుశ్శాసనులతోడను, అఖిత

మగు సైన్యముతోడను గూడి దుర్యోధనుఁడు వేటలాడుటకు పూనుకొనెను. వారిసైన్యములు క్షణమాత్రమున నా యరణ్యమునల్లకల్లోల పఱిచెను, ఆ యలజడికి కకావికలైపోవు మృగములను గొందఱు తమతమ యాయుధములపాలు చేయుచుండిరి. వారి ననుసరించుచు, ప్రోత్సహించుచు, దుర్యోధనుఁడు గూడ కొంతవడి వేటలాడి క్రమముగా ద్వైతవనసరోవరమును జేరుకొనెను. ఆ సమీపముననే ధర్మరాజు మునిజనులతోగూడి వన్యాహారముల నుపయోగించుచు సద్యస్కాండమను జన్నము సేయుచుండెను. ఆసంగతి గ్రహించి దుర్బుద్ధియగు సుయోధనుఁడు కర్ణదుశ్శాసనులతో నాలోచించి యా సరోవరము చెంతనే తమకుఁ గ్రీడాగృహములు నిర్మింప పరిజనుల కాజ్ఞ యిచ్చెను. రాజాజ్ఞ కాగానే కొందఱు శిల్పులు, సేవకులును జేరి తగిన పరికరముల నాయత్తపఱుచుచుండఁగా కొందఱు గంధర్వులుచూచి సమీపించి పనివారలతో నిట్లనిరి. "ఓయీ! యెవరి యాజ్ఞానుసార మీ తావు మీరుచేరితిరి? మీవఱుసచూడ నిచట నెవ్వియో కట్టుటకుఁ బూనినట్లున్నది. దీని నెవరు చేయుమనిరి. ఈస్థానము చిత్రసేనుఁడను గంధర్వరాజుది. ఆయన విహరించుటకై యీ సరోవరము నిర్మింపబడినది. కాన మీరిట నిమిషమైన నిలవవీలు లేదు. పొండు".

ఆమాట లాపనివారు విని యావార్త దుర్యోధనునికిఁ దెలిపిరి. ఆతఁడు కొందఱు సైనికులను గంధర్వులకు తగినట్లు

బుద్ధిసెప్పి మనపనులు పూర్తి చేయుఁడని పంపెను. వారునుగంధర్వులను గాంచి "ఓయీ! ఏమి మీయాగడములు ? ఎవరిపై చేయుచున్నారు? ఈ ప్రదేశమెవ్వరిదని తలఁచుచున్నారు?మహా బలశాలియు, నూర్గురన్నదమ్ములు కలవాఁడును, తిరుగులేని శాసనము గలవాఁడు నగు మా దుర్యోధన చక్రవర్తి యిట క్రీడాగృహములు నిర్మింపుఁడని సెలవిచ్చియున్నారు. వారీప్రదేశమునకు క్రీడార్థము ప్రియకామినుల సహస్రముతో వచ్చి విడిదెలు తీర్చియున్నారు. మీరిటనున్నచో ప్రమాదముతప్పదు పొండు. ఇది రాజశాసనము" అనిగద్దించి పలికిరి.

వారి ప్రలాపములకు గంధర్వులు పరస్పరావలోకనమొనర్చుచు పకాలున నవ్వుచు "ఎవఁడా దుర్యోధనుఁడు ? ఏక్కడివాఁడా చక్రవర్తి? ఎవరికి ప్రభువతఁడు? తన్నును, ఎదిరిని తెలియని యింత వివేచనకలవాడా యతఁడు ? గౌరవము దక్కించుకొని యిచ్చోటువిడిచి చల్లగ తనదారి తానుబట్టునటులు చేయుఁడు. ప్రాణములపై నేమాత్ర మాశయున్నను నిట్టి దుందుడుకు పనులుచేయవలదని మామాటలుగా జెప్పుడు" అని నిష్ఠురముగఁ దెలిపిరి.

సైనికులును వారి యాకారవికారములుగాంచి కొంచెము వెనుదీసి తొందరపడి మనము తలఁపడనేల ? వీరు సామాన్యులుగాఁ దోచుటలేదు. ఇప్పుడు మనము వీరలకాదని త్రోసివచ్చితిమా వ్యవహారమెట్లు అడ్డదిడ్డముగ దిరుగునోయని వెనుకక్కు

దగ్గి వారిమాటలు యథాతథముగ కురుపతి కె ఱిఁగించిరి దానికి దుర్యోధనుఁడు దురభిమానగ్రస్తుఁడై తమ్ములను దొరలనుగాంచి "మీరందఱును మీమీ సైన్యముల గూర్చికొని దుర్వినీతులగు గంధర్వుల పాఱఁదోలిరండు. వారల కిందాఁకది దేవతలు సాయపడవచ్చినను క్షమింపక జయించి సరోవరమాక్రమింపుడు" అని సెలవిచ్చెను. తోడనే చతురంగబలములతో కురుయోధులు దిక్కులు పిక్కటిల్లునట్లు సింహనాదములు చేయుచు సంద్రమునుజేర పఱువులెత్తు వర్షకాలపు నదివలె గంధర్వుల సమీపించి యుద్ధమొనర్ప మొదలిడిరి.

అంత నచటి గంధర్వులు నుంతయు తొట్రుపడక "ఓయీ! ఒక సంగతివినుండు. ఈ ప్రదేశము గంధర్వరాజగు చిత్రసేనునిది. ఇక్కడికి మీ రేలవచ్చెదరు? మీకుమాతో నీ యనవసర విరోధమేల? యుద్ధమనఁగా మాటలు ప్రోగుజేయుట గాదు. విందుకుడుచుట కాదు. వ్యర్థముగా కొన్నివేల ప్రాణములు దీయుట జరుగును. కాన మీ పూనిక మానుకొండు" అని పలుకుచుండ కౌరవయోధులు వారిని లెక్కసేయక వారిపై నస్త్రశస్త్రములఁ గురియించిరి. గంధర్వులును వారిధాటకు తాళలేకపోయి విషయమంతయు వారిప్రభువునకుఁ దెలిపిరి. అతఁడు పట్టరాని కోపావేశముచే "లెండు, వెడలుఁడు, ఆలసించెద రేల? "ఆలస్య మమృతంవిషం" అన్న నూక్తి వినరా? వెంటనేపోయి ఆకౌరవులనో గివురవులనో రూపుమాఁపి రండు" అని పెక్కు

యోధులను వారిమీదికి కవియఁ బురికొల్పెను.

రాజాజ్ఞ శిరసావహించివారు వెడలి కురుసైన్యములను దాకిరి. ఉభయపక్షములకును దీవ్రమైన సంగ్రామము జరిగెను. గంధర్వులు మహాబల పరాక్రమములఁ జూపి కౌరవసేనల నోడించుచుండఁగా దుశ్శాసనాది వీరులెల్ల తొలఁగి దుర్యోధనుని కడకేఁగి నిలువఁబడిరి. అప్పుడు మహారథి కర్ణుఁడొక్కఁడును స్థిరుఁడై నిలువఁబడి గంధర్వుల దేహములు తన శస్త్రపరంపరలచే తునిమితూటాడుచుండెను. ముహూర్త కాలములో నాతఁడా గంధర్వసేనను పురుగైన మిగులకుండ కావించి సింహనాదము చేయ నదేమి చిత్రమోగాని చీమలపుట్టలవలె చెలరేఁగుచు శతసహస్ర సంఖ్యలు గంధర్వులు నేలయీనిన వడుపున గోచరించిరి. అచటి రణరంగమంతయు గంధర్వమయ మయ్యెను. తోడనే దుర్యోధనుఁడు తన దమ్ములనుగూడి కర్ణునకు సహాయ మొనర్ప రణమునకు దూకెను. తమవారు పరులు, అనుభేదము తెలియకుండ కొంతవడి తుములయుద్ధము జగత్ప్రళయముగ జరిగెను. కొంతవడికి గంధర్వబలగము వేసవి మండుటెండకు మాడిపడిన చీమలవలె చచ్చిపడిరి. మిగిలిన వారీసంగతి చిత్రసేనునకు నివేదింప నాతఁడంతకుని భంగి బయలుదేరి కౌరవసేనను తాఁకెను. ఆతనితోపాటుగ నపారమైన గంధర్వసేన తిరిగియుద్ధరంగమున పొడసూపి కూటయుద్ధము మొదలుపెట్టెను. ము మ్మొదటగంధర్వులు దమమాయాబలమువలనవాయు ప్రసా

రమునరికట్టిరి. పిదప సూర్యకాంతి కానరాకుండ జీకట్లువడఁ జేసిరి. వెంటనే కౌరవయోధులెల్ల కడుపులుబ్బి ప్రాణములు పోవుటకు సిద్ధమై నేలఁగూలిరి. రథములు ఆగిపోయెను. హయములు కరులు నూపిరాడక పీనుగులవలె కూలెను. మఱికొందఱిని పట్టి గంధర్వులు చిదుకమోదిరి. అందుకొందఱు పరపరాక్రమము సహింపఁజాలక ధర్మరాజున్న సైపునకు పరువెత్తిరి. అప్పుడు రాధేయుఁ డొక్కఁడును అజేయుఁడై కులపర్వతమువలె నిలువం బడి గంధర్వుల బాణములదెబ్బలకు నొచ్చియు నూపిరాడునంత దనుక వగరచెందాడుచునే యుండెను. దుశ్శాసన సౌబలుల దుర్యోధనాదులు నిలువఁజాలకయు పౌరుషమునకు నిలువంబడి కర్ణునికి పేలగు సాహాయ్యమొనర్చుచుండిరి. కాని యనంతబల సమృద్ధులు, మాయావులు, లక్షోపలక్షలై యున్న గంధర్వులచేత తన రథమును, గుఱ్ఱములను, ధనుస్సును గోలుపోయి కర్ణుఁడు రణరంగమువీడి పారిపోయెను.

దుర్యోధనాధులు మాత్రము విముఖతచెందక యదే పనిగ పోరాడుచుండ చిత్రసేనుఁడా గ్రహపరవశుఁడై దుర్యోధనుని కేశములంబట్టి నేలబడవైచి పెడకేలుగట్టి సింహానాదమొనరించెను. వెంటనే మిగిలిన గంధర్వులు తత్సోదరులను, వారి పుత్రులను, మంత్రులను, బంధించివైచి డేరాలలో ప్రవేశించి వారి వనితాజనమునెల్ల బంధించి వశపఱుచుకొనిరి. ఈ భీభత్స కరమైన చర్యకాంచి మిగిలిన కౌరవ సైన్యములెల్ల ధర్మరాజుకడ

కేఁగి శరణువేఁడి యిట్లు ప్రార్థించిరి.

"ఓ పాండవోత్తమా! రక్షింపుము రక్షింపుము. మీ తమ్ములగు కౌరవులెల్ల గంధర్వులచే పట్టుపడి పరాభవమందిరి. వారిని, వారి పుత్త్రులను, వారి భార్యలను, అనుజవర్గమును గూడ నాగంధర్వులు బంధించి యెత్తికొనిపోవుచున్నారు. దయామయా! నీవుతప్ప యిటవారలకింక దిక్కులేదు. నిముషమాలస్యము చేసినచో వారు మనవారినేమి చేయుదురో?" అని దీనాతిదీనముగా మనవి చేసుకొనుచుండ నా మాటలకు భీమసేనుఁడు పకపకనవ్వుచుఁ దన యన్నగారి కిట్లనెను.

"అన్నా? కాగలపని గంధర్వులు తీర్చిరి. మనముందుపని మిక్కిలి తేలికచేసిపెట్టిరి. ఎట్టిహింసయు లేక మనకు జయము సమకూరినది. వానికిదగిన ప్రాయశ్చిత్తమైనది. వానికర్మము వానిని కట్టిగుడిపినది. ఇన్నిదినములనుండి దుర్యోధనుఁడిట గద్దె వేసికొనియుండుట యెందులకని తాము తలఁచిరోగాని తప్పక మనల నవహేళన మొనర్చుటకే సుఁడీ. వాని దుర్నయము వానినే గొట్టినది బాగుగనే జరిగినది. తనతమ్ములతో, తనరాణివాసముతో తన ప్రియమిత్రములతో, సుతులతో కలసి ఒకేసారి బంధితుఁడౌట నాకడుపున పాలుపోసినట్లున్నది. తామా పాపాత్ముని విషయమై దయచూపనవసరములేదు. తామూరకుండుడు. మేము సమాధానమిత్తుము" అని పలుకు కోపాలాపములు ధర్మమూర్తియగు యుధిష్ఠిరుఁడు విని "తమ్ముఁడా!

నీవట్లాడఁ దగునా? ఇది దెప్పుటకు సమయముగాదు. మనసులు వికలములై చూడదిక్కును మొక్క దైవమును లేక మన రక్షణ నపేక్షించు మనవారికి మనమడ్డ పడవలదా? మనలో వారిలో పెక్కు భేదాభిప్రాయము లుండుఁగాక. మన మందర మొకేవంశమున జనించితిమిగదా! ఈ చిల్లరకారణములఁ బురస్కరించుకొని సహజస్నేహము వీడుట అవివేకుల లక్షణము. అన్నదమ్ములు తమలో దామెట్టులున్నను పరుల పరాభవించినప్పు డందఱును నేకీభవించుట లోకమర్యాద. లేనిచో ధనహానియు లోకనిందయుగూడ తప్పదు. తమ్ముఁడా! మనలోమనకు విరోధములు పుట్టినపుడు మన మైదుగురము వారు నూర్గురు పరులతో మనకు విరోధము వాటిల్లినపుడు మనము నూటయైదుగురము. దుర్యోధనుఁ డెంత నీతిమాలినవాఁడు కానీ! తనప్రియభార్యలతో సుతులతోడ గూడ కట్టు పడినాఁడు. ఈ పరిస్థితి దుర్భరముకాదా? దీనిని మన ముపేక్షింపనగునా? నాయనా! శరణాగతుల రక్షించుట మన ప్రధాన ధర్మము కాదా? లెమ్ము నీవు నీతమ్ములవెంట బెట్టుకొనిపోయి వారి చెఱలు విడిపింపుము" అనిపలుకఁ భీముఁడు "అన్నా! ఏల నీకీవెఱ్ఱి? మొదటినుండియు నిట్టి వెఱ్ఱిలోపడియే యింతకుఁ దెచ్చుకొన్నాము. పుట్టినదిమొదలు వాడు మనలయెడచేసిన చర్యలమానుషములు. నీచాతినీచములు. అట్టివిషసర్పమును రక్షింపు మనుటకు నీకు నోరెట్లాడుచున్నది? చావనిమ్ము. ఏమైన మన

కేల" అనెను.

"భీమసేనా! నీవన్నవి సత్యములు కావంగునా? కానిమ్ము. దీనావస్థలోనున్నవారిని చూచుచు నూరకుండరాదు. పాపమూతడు మనపైగంపెడాసగొని తప్పక సాయుపడుదురను నూహతో నుండును. ఇది మనకొక పుణ్యకార్యమేగాక గొప్పకీర్తికి గూడ కారణము. ఈ మంచితరుణము దాటంబెట్టరాదు. నాకీయజ్ఞదీక్షలేనిచో నేనేపోయి యుందును. నిన్నంత నిర్బంధపెట్టనేల? మీరు వెంటనే వెడలి గంధర్వుల ననునయించి మన బంధుగులను విడిపింపుఁడు. అనునయము కార్యసాధకము కానినాఁడు పరాక్రమముఁజూపి నాకోరిక తీర్పుఁడు" అని యుదేవనిగా ధర్మరాజు పట్టుపట్టఁగ నర్జునుఁడులేచి వారలచెంత నేనును, భీమన్నయు పోయి తొలఁగింతుమని ధర్మజునకు మాటనిచ్చెను. దానితో నకుల సహదేవులును సంసిద్ధులైరి. ఆనలువురును వీరోచితవేషముల దాల్చి ముందునడువ పాటివచ్చిన కౌరవసేన వారిని వెంబడించుచుండ గంధమాదనము చేరిరి.

అచట కౌరవుల బంధించి కొంపోవుచున్న గంధర్వుల నెదిరింపఁబోయిరి. ఫల్గునుఁడుమాత్రమన్నగారి సెలవు ప్రకారము "ఓయీ! మాతో విరోధమేల? మీరొనర్చుపనికి మా యన్న ధర్మరాజంగీకరింపలేదు. మా బంధుగులగు వీరినెల్ల విడువుఁడు. రాజాధిరాజగు ధర్మరాజుశాసనమిది. వారి యానతి పాలింప మేమిటకు వచ్చితిమి. లేదా. మీప్రాణములు మానా

ములుగూడ దక్కవు" అని నెమ్మదిగాఁ జెప్పఁగా గంధర్వులు "ఏమీ! ధర్మరాజు శాసనమా? ఆతఁడెవఁడు? మమ్ము శాసించు వాఁడు ఇంద్రుఁడు. మా రాజశాసనము మేమనుసరింతుము. మిగిలినవారెంత వారైనను మాకొక లెక్కా?" అని నిర్లక్ష్య ముగఁ బలికిరి.

దాని కర్జునుఁడు మిగుల కోపించి ఇనచో కాచికొండు. అనుచు నారిసారింపగా పాండవులు మువ్వురును వారి యాయుధ ములగొని గంధర్వసేనను నలువురు నాలుగువైపుల నుండియు గూపుమాప మొదలిడిరి. తన బాణ పరంపరచే నర్జునుఁడు కప్పి వేయుచుండెను. భీముఁడు తనచేతికి దొరకినవారినెల్ల నల్లులను నలిపినట్లు నలిపివేయుచుండెను. కవలు ప్రళయకాల రుద్రుల వలె మొగ్గరము చొచ్చుకొని చెలిపివేయుచుండిరి. గంధమాదన మంతయు నెత్తురుమయమై పీనుగుకుప్పలై చూచువారికి భీతి కొలుపుచుండెను.

గంధర్వులా ధాకకు నిలువలేక, చెఱపడిన దుర్యోధ నాదులను విడువక వారినెత్తికొని యాకసమున కెగిరిపోవఁ యత్నించిరి. అది పసిపట్టి కిరీటి తన బాణజాలములచే దిక్కు లను నాకాశవీధిని దట్టముగ కప్పివైవ వలలోఁ జిక్కుకొన్న పులుంగులవలె గగనచరులు దాఁటిపోలేక యదృశ్యులై కల హింప వారినర్జునుఁడు శబ్దభేదులైన యస్త్రములచే బిట్టుమట్టి బాధించెను. అపుడు గంధర్వపతి చిత్రసేనుఁడు యుద్ధము విర

మించి నిజదేహముతో నర్జునుని సమీపించి తనవిషయ మెఱింగించెను. అంతనందఱును యుద్ధముమాని నిలువఁబడియుండ సవ్యసాచి గంధర్వపతితో "ఓయీ! కౌరవులతో నీకీ విరోధమేల ? సతీపుత్ర సహితముగ కౌరవపతిని విడువుఁడు లేకున్న యుద్ధమునకు రెండు" అనెను.

చిత్రసేనుఁడును యుద్ధమువలన లాభము లేదని తలంచి "అర్జునా! ఏమి నీకీపట్టుదల? మీరీ వనమందుండిరనియు, మిమ్ము పరిహాసింపవలెననియు నీ పాపాత్ముఁడు వచ్చియున్నాఁడు. ఇది నీతండ్రి యింద్రుఁడువిని వీరిని బంధించి పట్టితెండని మమ్ము పంపెను. మాకునీపై కోపము లేదు. మావిధి మేము నిర్వర్తించు చుంటిమి. ఇచట నీయడ్డు లేల?" అనెను. దానికర్జునుఁడు "ఆర్యా! నీవు చెప్పినది సత్యమే. ఈ దుర్యోధనుఁడు మా సహోదరుఁడు. ఈతని చెఱలు విడిపించి తెండని మాయన్నగారి యాజ్ఞ. దాని నెఱవేర్పనిచో మాకు తలవంపులు. కాన నీవు నాకొఱకైనను నొక్కతూరి మా యన్నగారి యొద్దకు రాకతప్పదు. ఆవల నాతఁడేమని చెప్పిన నట్లే కానిత్తము" అనెను.

అందుల కాతఁడు సమ్మతించి బంధితులగు కౌరవులతోడను భీమాదులతోడనుగూడి ధర్మరాజుకడకరిగెను. అంత నా యజాతశత్రుఁడు చిత్రసేను నతిప్రియమున గారవించి పూజించి "మహాత్మా! ఇంతవఱకు తాము మావాంశ్రకు ప్రాణాపాయము చేయకుండుటకు నేనుమిగుల సంతసించితి? మేలయ్యెను?

ఇది మనయుభయులకు క్షేమము. మా నాఁడెట్టి యపరాధముచేసి నను మా మొగముచూచియైన వీని విడువవలయును. ఇది తెలి యకచేసిన పొరపాటు. అట్టిదానిని మన్నించుట మనబోటివార లకు విధి" అనిప్రార్థింప నాతఁడు శాంతించి కౌరవులవిడిచి పుచ్చ ననుజ్ఞనొసఁగి వెడలిపోయెను. గంధర్వులు బంధములు తొలఁగించి ధర్మజుని సెలవంది వారిదారిని వారుపోయిరి.

బంధమోచన మందిన కౌరవులును వారి కాంతలును, తలలువంచికొని ధర్మజు నెదుట నిలువఁబడి ఖిన్నులైయుండ దుర్యోధనునిగాంచి యాధర్మమూర్తి "దుర్యోధనా! ఎంత తెలివి మాలినపని యొనర్చితివి? ఇట్టి విషమ కృత్యములలోనికి నిఁక నెన్నఁడును దిగకుము. మానవుఁడూహ మాని ధర్మవిరుద్ధమైన కృత్యములాచరించి తనచేటు తానే తెచ్చుకొనును. నీచులతోడి స్నేహము మంచిమనసులను సైతముమార్చి ప్రమాదములలోఁ బడవైచును. దీనినే "పరబుద్ధిర్వినాశాయ" అని పెద్దలందురు. దుర్జనునికి మఱియొక దుష్టుడు సాయమైనచో నగ్నికి వాయువు సాయమువలె పరిణమించి తుద కణఁగారుటయే తటస్థించును. రాజాధిరాజవై పదిమందిలో తిరుగునీవంటివాఁడే యిట్టియకృత్య మొనర్పఁబూనుకొన నిఁక సామాన్యజనుల విషయమేమగునో! మాచే విడిపింపఁబడినందులకు నీమనసులో బాధపడక హాయిగ నింటికిపొమ్ము" అనిబుద్ధిచెప్పిపంపివేసెను. దుర్యోధనుండును దీనా ననుఁడై చేయునదిలేక యచ్చోటువిడిచి మహా విచారముతో

వెడలెను. ఆతని వెంబడినే తత్పత్నీజనము, మంత్రులు, సామంతులు, తమ్ములు, మున్నగువారెల్ల మిగులసిగ్గుపడి వెడలిపోయిరి. ధర్మతనయుని ధార్మిక స్వభావమున కచటివారెల్ల బహువిధములఁ బ్రస్తుతించిరి. లోకోత్తరులగు మహాత్ముల చిత్తముల నెవఁడు తెలియఁగలడు?

పిదప దుర్యోధనుఁడు మిగుల లజ్జపడి తలనెత్తికొనలేక తన ప్రేయసీజనులనైన పలుకరించలేక "అక్కటా! తానొకటి దలచిన దైవమొక్కటి తలచెను. అన్నట్లు నాకు శృంగభంగమైనది. నిరపరాధులై, నట్టడవిలో వసియున్న పాండవులను బాధింపపూనుకొన్న నాకిట్టికీడు మూడకుండునా? చాలు నీ పరాభవము నాజన్మమునకుఁ జాలును. ఇఁక నేను జీవించినను మరణించినను నొక్కటే" అని తలంచుచు లోలోన కుమిలి కుమిలి దుఃఖించుచు, తనబాధ నొరులెరుగకుండ గోపనము చేసికొనుచు, తన స్థానముచేరి డేరాలో నొంటరిగనుండెను. ఆతఁడెవ్వరితోడను పలుకాడకుండెను. సర్వదా తన తల్పమునే యంటిపెట్టుకొని కన్నులనీరు పెట్టుకొనుచు నేదేదో భావించుచు, నుండెను. ఎవ్వరితోడను మాటాడనొల్లకుండెను. ఎవ్వరికిని నాడేరాలోనికి ప్రవేశమే లేదు.

ఇట్లుండ మరునాఁడాతని యథారీతి చూచుటకై కర్ణుఁడు వచ్చి "మహారాజా! కుశలమా! కామరూపులగు నా గంధర్వుల యుద్ధమెంత ప్రమాదకర మయ్యెను! వారి పరాక్రమములు

మనుష్యాతీతములు. ఇట్టిసంగ్రామ మేను కనివిని యెఱుఁగను. ముఖాముఖి యుద్ధమొనర్చువారి నేమైన చేయగలముగాని యదృశ్యులై కవియు వారి నెవరేమి చేయుదురు ? చచ్చిన కొలంది లక్షోపలక్షలు తిరిగి పుట్టుచుండ వారి నెవరు జయింప నోపుదురు ? అట్టివారిని నీవును నీతమ్ములును పురుషకారము చూపి గెలిచితిరి. నీవును చూచుచుంటివిగదా! వారితో నే నెన్నిపాట్లు పడితినో! అంతుపంతులేని యా గంధర్వులనడుమ నే నొంటరినై వారిశస్త్రాస్త్రములచే మిగులనొచ్చితి. నిలువనోపక పోయెను. దానితో రణరంగమునుండి తొలగిపోయితిని. నీవు మిగుల నోపికపట్టి నిలిచి తుదివఱకుపోరి జయమునొందితివి. నీ కెప్పుడెట్టి సాయమవసరమగునో అని మాత్రము నాప్రాణము లైదును నీమీఁద నేయుండెను. ఇప్పుడు నిన్ను చూచిన వెనుక నాగుండెలు కూటపడినవి. నీవుచూపిన పరాక్రమము నేఁటి దనుక యీభూమిపై చూపినవారెవ్వరును లేరు" అని యూరకుండెను. ఆ పలుకులువిని రాజుతనలో "అయ్యో! ఇతఁడు జరిగినది తెలియక నేను నిజముగా జయమొందితినని యే యనుకొని యిట్లు పలుకుచున్నాఁడు. ఈ దురదృష్టవంతున కట్టి గౌరవము చిక్కునా? ఇప్పుడీతని కేమని ప్రత్యుత్తర మీయవలెను? "అనుకొని లజ్జితుడై రాధేయున కిట్లనియెను.

"కర్ణా! జరిగిన సందర్భమెఱుంగక నీవిట్లు పలుకుట సహజమే. కాని నీవన్నంతటి యదృష్టము నామోమున వ్రాయ

లేదు. వినుము. నీవు వెడలిన వెనుక నా యనుజులును నేనును గంధర్వులచే మిగుల నొప్పింపబడి బంధింపబడితిమి. తోడనె నాతమ్ములను, భార్యలను, మిత్రులను జుట్టుముట్టి యెచ్చటి వారినచట గంధర్వులు పెడరెక్కలుకట్టి బంధితులజేసిరి. ధర్మ రాజు దయచే మేమందఱము మోక్షమంది యిప్పటికిట్లు చావ లేక మిగిలియున్నామ"ని దుఃఖించెను.

ఆ మాటలకును, పూర్వాపరము లెఱుఁగని తన పరా మర్శకును మిగుల లజ్జితుఁడై కర్ణుఁడాతనికి సమయోచితముగ "రాజా! జరిగినదానికై విచారమేల? ఏరాజు రాజ్యమున ప్రజలు హాయిగసుఖింతురో యట్టి జనులా రాజునకు బంటులవంటివారు. వారి క్షేమమునకు రాజేగదా కారణము! అట్టిప్రజలు రాజునకవ సరమగు తఱి తోడ్పడవలెను. అదివారికి విహితధర్మము. ప్రకృ తము పాండవులు నీ రాజ్యములోనున్న ప్రజలు. నీ యవసర మునువారు తీర్చుటలో నబ్బురములేదు. దీనికింత విచారింప బనిలేదు" అనిచెప్పి యాతని నుత్సాహపఱిచి మరల పురాభి ముఖునిగ నొనర్చెను. కతిపయ ప్రయాణములతోఁ గౌరవులెల్ల స్వనగరము చేరికొని యథారీతిగ మెలఁగుచుండిరి.

# గురుధిక్కారము

పాండవు లింద్రప్రస్థపురమున సుఖముగ నివసించుచుండ నొకనాఁడు నారదమునీంద్రుఁడు వారినిజూడవిచ్చేసెను. అప్పుడు ధర్మజుఁడాతని సగౌరవముగ నాసనముపై కూర్చుండఁజేసి ఊరకరారు మహాత్ములు, వచ్చినపనిదెలిపి నన్ను ధన్యునిజేయుఁడనెను. అంత ముని "రాజా! చతుర్భుజములవలె నీ తమ్ములు నిన్ను సేవించుచుండ, చల్లని పరిపాలనమొనర్చుచు ప్రజలను సర్వవిధముల నీ కనురెప్పలగప్పి కాపాడుచున్నావు. వారియనురాగమును జూఱలుగొన్నావు. పాలకుల కింతకన్న కావలసిన దేమున్నది? అదే ప్రభువులకు మూలధనము. ప్రజాదరణమే రాజునకు కిరీటము. కాని నీవు లోకమును తృప్తిపఱచినట్లే నీ పితృలోకమును గూడ సంతృప్తిపఱుప వలసియున్నది. దానికై నీవు రాజసూయము నొనర్పవలయును. దానివలన నీ పితరులు శాశ్వతపుణ్య లోకములందు యింద్రసన్నిధి నివసింప నర్హులగుదురు. నీవంశమున నెందఱో రాజు లీక్రతువును గావించి పితౄ ఋణమునుదీర్చికొని ధన్యులైరి. మున్నొకసారి వైవస్వతలోకమున నున్న నీతండ్రి యిట్టినీకోరిక వెలిబుచ్చి నిన్ను క్రతుకరణమునకై ప్రోత్సహింపవలసినదిగా నన్ను గోరినాఁడు. దానిని నీకు దెలుపవచ్చితిని. ముందు నీతమ్ములును నీవును దిగ్విజయమొనర్చి ధనమును కూర్చికొనుఁడు. ఆ ధనముచే నన్నవస్త్ర

స్థానములొనర్చి దేశమందలి యనాధులను, దీనులను చతుర్వ
ర్ణములవారిని పోషింపుడు. ఇది నీకీర్తి నా చంద్రతారకముగ
నిలువగలుగును" అనిబోధించి వెడలిపోయెను.

ఇట్లు నారద ప్రబోధితుఁడై యుధిష్ఠిరుఁ డొకనాడు
సుహృద్బాంధవ మంత్రిసమక్షమున "పూజ్యులారా! పితృహి
తము చేయుటే సుతులకు ముఖ్యకర్తవ్యము. కొమరులుపుట్టి
నందులకు ఫలము పితరులు వారివలన నానందించుటయే. అట్టి
పితృతారకమైన రాజసూయము చేయుసంకల్పము నాకు గలిగి
నది. దీనివలన ఐహికాముష్మిక సౌఖ్యములు కలవని నారదులు
వచించిరి. ఇందులకు మీ యుద్దేశమేమ" నెను.

ఆ మాటలకు ధౌమ్యప్రభృతులిట్లనిరి. "రాజా! తప్పక
చేయుము. దీనివలన ప్రజలకు సమస్తదోషములునుతొలఁగును.
దేశము సుభిక్షమగును. ప్రకృతము సామంతరాజులెల్ల నీ
ప్రతాపముచే జయింపబడిరి. వారినుండి సంపదలు గ్రహించుట
కిది మంచితరుణము. లోకమున నిన్ను మించిన రాజేఁడీ! అయిన
నీ మహాక్రతువు నిర్విఘ్నముగ నిర్వహించుటకు ఒక్కపుండరీ
కాక్షుఁడే సమర్థుఁడు. ఆతఁడు లీలామానుష విగ్రహుఁడు. ఇత
రుల కిది యశక్యము" అని చెప్పిరి.

యుధిష్ఠిరుఁడును వెంబడినే వారల యుద్దేశానుసార
ముగా కొందఱుభృత్యులను రప్పించి "మీరు వెంటనే రథమెక్కి
ద్వారకకుబోయి శ్రీకృష్ణభగవానుని తోడితెండు" అని పంపి

యాతఁడు వారిదగ్గరమునకై యెదురు తెన్నులు చూచుచుండెను.

ఆసందేశమంది శ్రీకృష్ణుఁడు పాండవులను చూడవలెనను కుతూహలములతో పయనమై యింద్రప్రస్థము చేరి కుంతికిని ధర్మరాజునకును వినయముతో నమస్కరించి, భీముని గౌఁగి లించికొని మిగిలినవారిని చల్లనివాలుచూపులతో గౌరవించెను. ధర్మరాజుడును మహానంద పరవశుఁడై గురువులను బూజించినట్లు సింహాసనమున గూరుచుండఁబెట్టి యా లోకప్రభువును పూజించెను. సమస్తజీవరాసుల యోగక్షేమములను గనుగొనునట్టి యాతని యోగక్షేమముల నడిగెను, అడిగి "ఓ పద్మనాభా! నీవు లోకులచే ధ్యానింపఁదగినవాడవు. లోకమునందెల్లెడల నిండినవాఁడవు. నమ్రతగలవారలకు విధేయుఁడవు. సకలనయోపాయము లెఱిఁగినవాఁడవు. నీకుఁ దెలియనివేవియు లేవు. ఐనను నీకు దెలియదనుకొని మనవి చేయుచున్నాను. "నీవు పితృహితమునకై రాజసూయ మొనర్పుము". అని నాతండ్రి నారదమహర్షి మూలముగ నన్ను నియమించెను. నాకట్టి సామర్థ్యమున్నదనియో, లేక నాయందట్టి నెయ్యముననో యాయన సందేశ మంపియుండవచ్చును. నేను దాని నంగీకరించితిని. నా వర్గము వారందఱును దీనికి దోడ్పడనున్నారు. నీ సెలవునకై యపేక్షించియున్నాను. ఏమందువు స్వామీ!" అని చేతులు జోడించియడుగగా కేశవుఁడు "బాగున్నది. చాల బాగున్నది. కావలసిన యంగబలము నీకున్నది. ప్రజల యనురాగమున్నది.

సకలసుగుణములు నీయందున్నవి. తేజశ్శాలివి. నీవీక్రతువొనర్ప సమర్థుడవు. కాని నీకిపుడు కావలసినది యొకయర్థబలము. దాని సమకూర్ప నీ తమ్ములను దిగ్విజయమునకై నియోగింపుము. నీక్రతువు పూర్తియగును" అనియానతిచ్చి వెడలిపోయెను.

పిదప ధర్మజునాజ్ఞనై యర్జునుడుత్తర దిగ్విజయము సేసి సమస్తరాజులకును దన యన్నగారొనర్చు యాగవిషయమును గూర్చి చాటుచు కప్పములుగను, బహుమాన పురస్సరముగను నపార ధనరాసులను దెచ్చెను. భీమసేనుడును పూర్వదిగ్విజయ మొనర్చియు, సహదేవుడు దక్షిణ దిగ్విజయ మొనర్చియు, నకులుడు పశ్చిమ దిగ్విజయము జేసియు నందందలి రాజులవలన నపారమైయనంతమైన ధనకనకవస్తు వాహనములును, వజ్ర వైడూర్య నీలగోమేధికాది పరార్థ్యమణిరాసులను కానికలుగా దెచ్చి నవనిధులను మించు నిధిసంపదలను సమకూర్చి వానిని ధర్మజునకు సమర్పించిరి. అతడును ధర్మోపార్జితమైన యామహా ధనము సత్పాత్రదాన మొనర్చుటకును, అనాథులను, దరిద్రులను పోషించుటకును వినియోగించుటకై యాగమొనర్పజూచు చుండ నాతని యాప్తమంత్రులు "ఓ కురువీర! నీ ధర్మపరిపాలనమునందు ప్రజలెల్లరి యీతిబాధలును లేనివారైరి. మీతమ్ముల బలపరాక్రమములకు సమస్తరాజులును లొంగిపోయిరి. కావలసిన యంగబలమును, అర్థబలమునుగూడ సమకూరినది. నీకోశములు రజతసువర్ణ పరిపూర్ణములైనవి. నీ కోష్ఠాగారములు

ఘృతలవణ తైలతండుల ధాన్యాదికములైన వివిధ వస్తువులతో నిండియున్నవి. యజ్ఞముచేయింప మూర్తిమంతములైన వేదములవలె విప్రులు సిద్ధముగనుండి నీ యభ్యుదయమును గోరుచున్నారు. కాన నీవాలస్యముచేయక క్రతువు మొదలిడుము” అని వేగిరించి ప్రోత్సహించిరి.

అట్లు మహర్షిచేతను, కృష్ణునిచేతను, ఆప్తమంత్రులచేతను ప్రోత్సహింపబడి ధర్మజుఁడొక శుభముహూర్తమున రాజసూయమొనర్ప సంకల్పించి సహదేవునిజూచి “ఓయీ! నీవు మన పురోహితులు ధౌమ్యులు చెప్పినరీతిగా యజ్ఞమునకు కావలసిన సమస్త సంబారములను సమకూర్పుము. జన్నముగాంచుటకై దేశదేశములనుండి వచ్చు రాజులకు దగిన వసతులేర్పాటు చేయింపుము. నిఖిల మహీతలమందున్న బ్రాహ్మణులను క్షత్రియులను శుభలేఖలు వ్రాయించి యాహ్వానింపుము” అని యాజ్ఞాపించెను.

ఆతని సెలవునంది సహదేవుఁడు యథాశాస్త్రముగ యజ్ఞభూమిని శోధనమొనర్చి యేయేదిక్కుల నేయే కట్టడములుండవలెనో వేదికలెట్లు నిర్మింపవలెనో వానివాని ప్రమాణముల ననుసరించి యతిరమణీయముగ నిర్మింప శిల్పుల నియమించెను. అందుకావలసిన సంబారములను నింపివేసెను, ఆయిందప్రస్థము చుట్టుబట్టుల బహువిధములైన యగారములు, పటకుటీరములు, తోటలు, నూతులు, దిగుడుబావులు, మున్నగు

సమస్త సదుపాయములను నిర్మింపఁజేసెను. పట్టణమంతయు పండుగనాళ్ళలోవలె నానావిధాలంకారములచే కలకల లాడుచుండెను. శుభశోభనములందు వలె నాబాలగోపాలము వారి వారి దేవాగేహముల ముస్తాబులలోముంచివేసికొనిరి. సామాన్య సంసారులు తమబిడ్డ పాపలతో కలుకుచు నింక కొన్ని నెలల వఱకు నింట వంటలుఁ లేవు” అనుకొనసివంటయిండ్లకు తాళములు వేసికొనిరి. తోరణములు కట్టువారు, పెల్లలు వేయువారు, సరకులనటునిటు పరుగులై మోయువారు, పందిళ్ళ నిర్మించువారు, కంబముల పాతువారు, వీధులను శుభ్రమొనర్చువారు దుర్వాసనలు లేకుండ అగరుపన్నీరుల చిమ్మువారు, నడతెఱపి లేక, విసువువిరామములు లేక, వేళపాళ తెలియఁగక, ఆకలి దప్పులు మానుకొని తదేకదీక్షతో నుండిరి.

శుభలేఖలందుటతోడనే పుత్రమిత్ర సమేతులై విరాట ద్రుపద శిశుపాలగాంధారరాజులును, భగదత్త శల్యసాల్వ భూపతులును, కుంతిభోజ పౌండ్రకవాసుదేవ వసుదేవ బలదేవ ప్రద్యుమ్నాదులును, భోజాంధకులును, మఱిన్నిగు రాజులెల్ల విచ్చేయుచుండిరి. వేదవేదాంగ పారగులైన బాపలును, సర్వ కర్మనిరతులైన వైశ్యశూద్రులును, స్త్రీ పురుష భేదము లేక తండతండములుగ దిగుచుండిరి. ఇట్లు సముద్ర ముద్రిత వసుంధర యందలి సమస్త జనులును దర్శనోత్సుకులై రాగా వారివారి విడిదెలలో నిలుపనవా దేవు డాజాపించుచుండెను.

నకులుడును నన్నగారి సెలవంది భీష్మాదులను దోడ్కి తెచ్చుటకై గజపురమున కరిగెను. భీష్మాది బంధువర్గమంతయు నపారమైన ధనరాసులు కానుకలుగా గొని కౌరవబలమును వెంటనిడి కొనివచ్చిరి. వారినెల్ల నపార గౌరవాదరములతో పూజించి ధర్మజుఁడు వారలకిట్లనెను "పూజ్యులారా! మీమీ యాదరములబట్టియు, మీమీ సహాయసంపదల ననుసరించియు నీమహాక్రతువొనర్ప బూనితిని. దీనిని మీరంఱును బూనుకొని నిర్వహింపవలెను" అని వారలచే ననిపించికొని హిరణ్యాము వెండి, బంగరు, రత్నములు మున్నగువాని దానములొనర్చు టకు కృపాచార్యులను, ఎవరికెట్టి లోటుపాటులు సంభవించు చున్నవో యరసి తెలుపుటకు భీష్మద్రోణులను, సమస్తవస్తువు లను కావలసి వానినందిచ్చుటకు విదురుని, నానాదేశములనుండి వచ్చెడి రాజలోకమిచ్చు బహువిధములైన కానుకలు కైకొను టకు దుర్యోధనుని, భక్ష్యభోజ్యాది వినియోగములకు దుశ్శా సనుని నియోగించెను.

పిదప తాను యజ్ఞదీక్షితుఁడై బ్రాహ్మణులతో జాతివర్గ ముతోడను పరివృతుఁడై స్వస్తివాచనము మిన్నుముట్టు చుండ, నపారమైన మంగళద్రవ్యముల గ్రహించి వేయిమంది సువాసినులు తన్ననుసరించుచుండ, పౌరులెల్ల పట్టరాని యానం దమున తోపులాడుకొనుచు ననుగమింప, బహువిధ వాద్య కోలాహలము మిన్నుముట్టుచుండ, ఆడెడివారవనితలతో, పాడెడి

గాయకులతో పొగడెడి వంది వైతాళికులతో, కోలాహలమడంచు రాజభటులతో మహేంద్ర వైభవముగ యజ్ఞాయతమునకు వెడలెను.

ఆ వేయినీరాజనముల వెలుఁగులో సువర్ణచ్ఛాయను మించు నొడలివన్నెయు, ఆజానుబాహువులు, కనకరత్న కిరీటము ధగధగలాడు భుజకీర్తులు, రవ్వలు తాపిన సువర్ణకంకణములు, కిరణములజిమ్ము రత్నకుండలములు, పట్టుపీతాంబరములు రవ సెల్లాలు, రతనపు పావడలు తనధార్మికత్వము సూచించు కస్తూరితిలకము కలిగి ప్రశాంతలక్ష్మి తాండవించు మోముతో దన రాజలక్షణములుట్టిపడు నట్లా రాజమార్గమున నడుగుదీసి యడుగువెట్టుచు చిఱునవ్వు తనగులాబి బుగ్గలపై చిందులాడు ధర్మనందనుని గాంచుటకొరకు వేయికన్నులున్న చాలవేమో యనిపించెను.

వేదనినాదము, ఆశీర్వాదనాదము, బహువిధ వాద్యనాదము మూఁడునుకలసి యుచటివారిని బధిరులనుగా జేసివైచెను. వేదమూర్తులైన పైల, జైమిన, ధౌమ్య, యాజ్ఞవల్క్య ద్వైపాయన, మైత్రావరుణాది మహర్షి శేఖరులు లగ్నముసమీపించుట తోడనే ధర్మజునిగూర్చుండఁబెట్టి యజ్ఞశాంతిము నడిపించిరి. ఇట్లు నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా, భీష్మాదిరాజర్షులు సహాయులుగా, సమస్త క్రియలను సంపూర్ణము లగుచుండ, సంపూర్ణ దక్షిణలంది వైదికులానందమంద, జగన్నాధ రక్షి,

తన్నీ యాక్రితు వతిరమణీయముగనొప్పెను. ఆ జన్నమున హోమములచే నగ్నియు, తద్భాగములందిదేవతలును, సంపూర్ణ దక్షిణలచే బ్రాహ్మణులును, సముచిత సత్కారములచే రాజవర్యులును వివిధాన్నదానములచే నానావర్ణములవారును, మిక్కిలి సంతృప్తినడి యనుజులతోఁగూడిన ధర్మజుని మిగులబ్రిస్తుతించిరి.

అట్లు నిర్విఘ్నముగా సమాప్తినందిన యామహాక్రితువు గాంచి, కౌరవపితామహుఁడును, శంతనుపుత్రుఁడును, మహావృద్ధుడును. పరిశాంతచిత్తుఁడునగు భీష్ముఁడు మిక్కిలి ధర్మబుద్ధికలవాఁడై యామనందనని కిట్లనెను. "ఓధర్మరాజా! నీవు మహాక్రితువును పూర్తి చేసి ధన్యుఁడవైతివి. కౌరవాన్వయము తరించినది. దానికిఁదోడు నీవొక్కపనిగూడఁ జేయవలసియున్నది మనకిష్టుఁడై, గురుప్రాయుఁడై, పరిపాలకుఁడై మహాత్ముఁడై సద్గుణగరిష్ఠుఁడై, ఖ్యాతినందిన మహాత్ముఁనెవ్వనినైన నీవెన్నిరయొక్కనికి "గురుపూజ"కావింపవలెను. ఇదియు నీయాగమునకంగమైనది" అనెను. దాని కాతఁడట్టి మహాత్ముఁడెవ్వఁడో యీసంఘమున తామెయెన్ని సెలవిచ్చినచో తప్పక యాపనితీర్చెదను. కులవృద్ధులు, సమస్తమెఱిఁగిన తమనిర్ణయమే నిర్ణయము. దానిననుసరించి గోవుతో లేఁగవలెపోవుటే మాకు మేలు. సెలవిండు" అనెను.

అంత భీష్ముఁడు "ఈభూభాగమునెల్ల తన దివ్యతేజస్సుచే నిండించి వెలుగుఁకలుగు చేయు సూర్యభగవానుని వలెను, తన

యమృత కిరణములచే జగత్తు నానందపఱచుచున్న చంద్రుని వలెను, ప్రకాశించుచు, తనకాంతిచేపరులకు తేజమును, తృప్తి యును చేయుచు, అనాదినిధనుఁడై, పుండరీకాక్షుఁడై అబ్జనాభుఁడై, యజ్ఞపురుషుఁడై, అఖిలలోకపూజ్యుఁడై, అచ్యుతుఁడుండగా అర్ఘ్యమందుట కితరులెవ రర్హులగుదురు ?

ఈ మహాత్ముఁడు మున్ను వరాహావతారమెత్తి హిరణ్యాక్షువధించి తన మునికోఱలచే భూతలమును ఎత్తివట్టెను. నారసింహమూర్తియై హిరణ్యకశిపుని తన గోళ్ళచే చీల్చిచెండాడి ప్రహ్లాదుని గాపాడెను. అదితి కశ్యపులకు వామనుఁడై పుట్టి త్రివిక్రముఁడై బలిని బంధించెను. భృగువంశమున పరశురాముఁడై పుట్టి కార్తవీర్యుఁడు మొదలుగాగల దుష్టులజంపి యిరువదియొక్క సారులు దిగ్దిగంతములవఱకు దిరిగి రాచపురుగును లేకుండ రూపుమాపెను. రవికులమున దశరథుని పుత్రుఁడై రావణాది లోకకంటకుల జంపెను. నేఁడు సురగణప్రార్థితుఁడై భూభారము తీర్ప యదువంశమున నీరూపమున జనించెను. తదాదిగా నాతఁడొనర్చిన యద్భుతములీ వెఱుఁగనివి కావు. పూతనను అణఁచెను. శకటాసురు భంజించెను. మద్దుల నన్మూలించెను ఖరవృషభాసురుల తెగటార్చెను గోవర్ధనగిరి నెత్తి గోపీగోప గోకులముల గాపాడెను. కేశిదానవునిపరిమార్చెను. కంసుని కడముట్టించెను. ఈతఁడు సాక్షాత్తుగ నాదినారాయణుడే! కాన నీవాతనినే పూజింపుము. ఇదియే నీ యజ్ఞఫలము"

అని యూరకుండెను.

అంతధర్మజుఁడును కురువృద్ధుని ఆజ్ఞననుసరించి సహదేవుఁ డందిచ్చిన పాద్యములచే వాసుదేవుని పాదము లుకడిగి పూజించి యథాశాస్త్రముగ సన్మానింపఁగా దానిని గాంచి సహింపలేక శిశుపాలుఁడు దెప్పుచు, ధర్మరాజుతో "ఓయి సుమాయకుఁడా! ధర్మరాజా! ఏకచ్ఛత్రాధిపతులు, అతిరథులు, మహారథులైనయిందఱు రాజన్యులుండఁగా, మహాత్ములును, పూజ్యులునైన యిందఱు బ్రాహ్మణశ్రేష్ఠులుండఁగా, ఈ ముక్కాలి ముసలి గాంగేయుని మర్యోధవిఁ, వీనినా పూజించివి? ఈతఁడు కులమునకా వ్యక్తికులమువాఁడు, చరిత్రకాపుట్టినది మొదలు హింసాకళంకితుఁడు. పైగా ఆజీతీజిన గజదొంగ. వీని మిగిలిన చరితలు పదిమందిలో నోరెత్తి చెప్పవలసినవిగావు. ఇతఁడు పూజార్హుఁడుకాఁడు. అనర్హునికర్ఘ్యమిచ్చి నీయవివేకము లోకమున కెఱిఁగించితివిసుమా! అదిగాక ధర్మతత్త్వము, ధర్మసూక్ష్మతను తెలిసికొనుట నీవంటివారికి సుకరముగాదు. ధర్మబాహ్యుడైననిన్నెట్లో యొప్పించి, బోధించి, యీజడునకుపూజచేయుమని దూరాలోచనలేని భీష్ముఁడు వట్టివెఱ్ఱివాఁడై నిన్ను నియోగించెను. వృద్ధులబుద్ధులిట్లేయుండునులే. అదియుగాక యాతనికేమైనముట్టచెప్పదలచినచో కొంచెమోగొప్పోధనమీయవలెను. అతని యభీష్టములేమైన నున్న తీర్చవలెను. మనకాప్తుఁడని యే లోటుపాటులును వాటిల్లనీయక చూడవలెను, అంతేగాని

మహాత్ములైన యిందఱు రాజన్యులును పూజ్యులైన యిట్టి యుగ్రవర్ణములవారు నుండియుండ సముద్రమువలెనున్న యీ సభలో, వేదవిహితమై సంపూర్ణమైన విధానముతో అనర్హునర్హునిగా జేసి యీ నల్లగొల్లని పూజించుటెంత తప్పొదెలియువైతివి! మఱియొకమాట. నీవీతని వయసుచే పెద్దయని పూజించితివా? కాదు. వానితండ్రి వసుదేవుఁడున్నాడు కాదా ? లేక ఋత్విజుఁడని యాలోచించి గౌరవించితివా? కాదు. అట్టియుత్తముఁడు ద్వైపాయనుఁడుండెనే. కాక గురుశ్రేష్ఠుఁడని యర్చించితివా ? ఆస్థానమలంకరింప వలసినవారు కృపద్రోణులుగాని యీతఁడుగాఁడు. భూనాథుఁడని పెద్దజేసితివా? అది పొసగనే పొసగదు. ఈభూమిపై నింతవఱకు యాదవవంశజులు రాజులైనదిలేదు. పూజనీయులైన పురుషులలో కృష్ణుఁడెవడై యుండెను? పూజింపఁదగినవారి పూజింపక కుక్కను గోవనియెంచి తగుదునమ్మా, అనిచెప్పిన భీష్ముని మాటవలన నీవు తేలికపడితివి.

ఓధర్మనందనా! నీవుపురుషులలో సంపూర్ణముగనన్నియు దెలిసినవాఁడవనియు, రాజులలో పూజ్యతముఁడవనియు నీ గుణములుప్రకటించి మహాదరముతో నీ క్రతువుచూడ నీరాజులెల్ల వచ్చియుండిరి. సంతసించిరి. కాని చివరకొనర్చిన యీ నిర్భాగ్యపుపనివలన నిందఱును బాధపడుచున్నారు. ఇందఱకును నీవు తలలు కొట్టివేసితివన్నమాట. ఎంత యవజ్ఞచేసితివి ? ఇదినీకేమియుధర్మముగాదు.

పోనిమ్ము. నీవు తెలియక చేసితివి. ఆ గోవిందునకు మాత్రముబుద్ధియేదీ? ఇదినాకుగాదు. ఇందులకింకను నర్హులున్నా రని చెప్పక వట్టి మొఱకువలె తానేల సిద్ధపడవలెను? నపుంసకు నికి రంభను కట్టబెట్టినట్లు చెవిటికి మధురమంజుల గీతి వినిపించి నట్లును, గ్రుడ్డివానికి సాటిలేని సౌందర్యముగల రూపమును చూపించినట్లును నీవీగొల్లని పూజించితివి. పైవానివలన నెంత ప్రయోజనమో నీ పూజవలనగూడ నంతేఫలము. వీరందఱును నవ్వగా నీ ధర్మరాజనామము నేతిబీరకాయ కావించుకొంటివి" అని వరుసపెట్టి యందఱను నిందించుచు తన పుత్రమిత్రులం గూడి యాసభనుండి దిగ్గన లేచిపోయెను. ధర్మరాజును నాతని వెంబడించివానిని ప్రియవచనములనే ననునయించుచు, "ఓయీ! ఏమది నీసంభాషణము? ఉత్తములకును, ధీరులకును రాజుల కును, గౌరవమందదలచిన వారికిని, ఇట్టిదారుణ సంభాషణము తగునా? ఇది విషముకన్నను అగ్నికన్నను క్రూరతరమైనది. మఱియు, మైత్రిగాని, పగగాని, తెలివిగాని, కోపముగాని, ధర్మముగానీ, పాపగతిగాని, వృద్ధిగాని, నీచత్వముగాని, పలుకుబడి ననుసరించియేసంభవించును. కానతొందరపడి పరుషభాషణము లకు దిగరాదు. కాలుజారిన తీసికొనవచ్చునుగాని మాటజాఱి నచో వెనుకకు మఱలించుట వట్టిది. కొంచెమోపికపట్టి నా మనవి వినుఁడు "ఆదిపురుషుఁడైన బ్రహ్మదేవుఁడు ఈతని నాభీ కమలమునుండియే పుట్టినాఁడు. వేదాది వాఙ్మయములందు

సైతము వేనోళ్ళ కొనియాడఁబడినవాఁడు. త్రిలోకములవారిచే కొనియాడఁబడినవాఁడు. ఈవిషయము లెఱిఁగియే పితామహుఁడాతని పూజింపుమనెను. ఇది దోషమెట్లగును ? ఓ శిశుపాలా! ఇందలి పరమార్థమాలోచింపగా శ్రీకృష్ణుని భీష్ముఁడెఱిగినట్లు నీవెఱుఁగవు. ఆతఁడు నీకర్థమగు మహాత్ముఁడుకాఁడు. పెద్దల చరితములు్వల కందనేర్చునే? మఱియు గురుఁడనియు, లోకోత్తరుఁడనియు, పరాత్పరుఁడనియు నీకంటె వృద్ధులైన రాజులెల్ల నమ్మి యచ్యుతుపూజకు వారెల్లనభినందింప నీవొక్కఁడవు కాదనఁజెల్లునా?" అని యాశిశుపాలునిచే నంగీకరింపఁజేయ బహువిధముల యత్నించుచున్న ధర్మరాజునకు భీష్ముఁడు "ధర్మనందనా! నీవాతని నంతగ ననునయింప నవసరము లేదు. ఈశిశుపాలుఁడు అవినీతిని పోషించువాఁడు. మిక్కిలి బాలుఁడు. ఇట్టివాఁడెక్కడ? ధర్మమెఱుఁగు టెక్కడ ? వైష్ణవత్వమర్థమగుట యెక్కడ? ఉట్టికెగురలేనమ్మ స్వర్గమున కెగురఁబోయెనఁట. వీని మానసము రాగము, కోపము, దురభిమానములచే నిండి శ్లేష్మపూరితమైన బొందివలెనున్నది. వీఁడకారణముగ నందఱితోఁ గయ్యమునకు కాలు త్రవ్వుచుండును. అపవాదము లాడుటయే వీని జిహ్వాచేయుపని. అల్పబుద్ధుల కంతకన్న సామర్థ్యమెచటనుండి వచ్చును. అని వారించి "ఓయీ! శిశుపాలా! ఏపాటియు వినయములేక హరి కర్ఘ్యమిచ్చుట యయోగ్యమంటివి. నీవు పరమమూర్ఖుఁడవు సుమా! ఈ సమస్తరాజులును

నాతని దయామయమైన వీక్షణముననే మనగలుగుచున్నారు. ఆమహాత్మునకు లోఁగనివారుగాని, ఆతని శరణందనివారుగాని వీరిలో నెవ్వరును లేరు, మోహాంధులీతని తెలియలేరు. రాజులలో నధికుఁడై యమిత విక్రమముగలిగి సర్వాధికుఁడై యేయేలికయుండునో యాతఁడే పూజ్యుఁడు. ఈ రెండు గారణముల చేతను నీకృష్ణుఁడే పూజార్హుఁడు. మాకేకాదు జగత్తున కే కైక సేవ్యుఁడాతఁడే. లక్షమంది వయోవృద్ధులుండనీ ! గుణవృద్ధుఁడై ధర్మవృద్ధుఁడై జగదేకశూరుఁడైయున్న నారాయణుని పూజింపు మంటిని. యిందేమి లోపము? మఱియొక మాట. లోకమునం దెవ్వరిని మనమర్చించినను, ఆతఁడొక్కఁడే తృప్తిపడును. ఈ మహాత్ముని పూజించినచో విశ్వమయుఁడౌటచే త్రిలోకముల వారిని పూజించినట్లే యగుచున్నది. నాయనా! యోగీశ్వరు లాతని నర్థము చేసికొన్నట్లు నీకాతఁడు గోచరింపఁడు" అని బుద్ధి చెప్పె.

అట్టి యవసరమున శోకతో క్రిన్న తాచువలె లేచి సహదేవుఁడు అంతకునివలె విజృంభించి "ఓయీ! కృష్ణుఁడే పూజ్యుఁడని పెద్దలుచెప్పినారు. మేమంగీకరించితిమి. మాయన్నగారాతనికే యర్ఘ్యమిచ్చిరి!. ఇది కాదన్నచో దీఱునది కాదు. "ఈ పని తప్పు" అని మూర్ఖత్వమున నెవ్వఁడైన నిందుపలుకుదు రేని వానితలపై నా యెడమకాలుంచెదను. మొనగాడున్న లెండు" అని యుఱిమెను. సభాసదులందఱును నా పలుకులకు మిగుల

భయపడి కిక్కురుమనక యూరకుండిరి. సభలోనుండగనే సహదేవునిపై పూలవాన కురిసెను. ఆకసముపై దేవతల సాధువాదములు చెలరేగెను. సభ్యులెల్లరును విస్మయమందిరి.

అంత శిశుపాలుని సేనాధిపతి సునీథుఁడనువాఁడు మిగుల రోషించి పరుషముగప్రతాపించుచు తనపక్షమువారి నందఱను పూనగట్టుకొని తన పాలకుని సెలవంది యుద్ధ సన్నద్ధుఁడయ్యెను. ఒక క్షణమాత్రమున యదువృష్ణి భోజసైన్యములు చెలరేఁగెను. సభయందలి వారందఱును కలగబాఱిరి. అట్టి సమస్త క్షత్రియ క్షోభమునుగాంచి ధర్మరాజు భయమున తల్లడమందుచు భీష్మునిగాంచి "ఓ పితామహా! ఈరాజులెల్ల ప్రళయ సమయమందలి సముద్రములవలె మహాక్షోభమంది తెగించి నడుములుబిగించి యుద్ధసన్నద్ధులైరి. దీనిమూలమున నా క్రతువునకు విఘ్నముదాకుండను, ప్రజలకెట్టిహానియు కలుగకుండను, బోధించి వీరినిప్పుడు శాంతపఱచుము". అని దీనుఁడైప్రార్థింప నాతఁడును "ఓయీ! వెట్టివాఁడా! పిరికివానివలె హృదయదౌర్బల్యము నందెదవేల ? అజేయపరాక్రముఁడై యజ్ఞపురుషుఁడైన నారాయణుఁడు నీ క్రతువును వేయికన్నుల కాపాడుచుండ దానికి విఘ్నమొనర్ప నేరికి దరమగును? ఆతఁడొకసారి యలిగి వీక్షించునంతనే యీ శిశుపాలుఁడును వాని ననుసరించువారును భస్మీపటలము కానోపుదురు. మదమాతంగముల కుంభములను పగిల్చిచీల్చి భక్షించుసింగమును పదివేల కుక్కలు రేఁగి మాత్ర

మేమి చేయగలవు ? విష్ణుముమాట నీ మనసునకైన రానీయ వలదు. అన్నియుఁ జూచుచుందుము. ఆ పరమపురుషుఁడే దీనిని సవరించును" అనిబిగ్గరగ బలికి యూరకున్న, శిశుపాలుఁడాగ్రహించి యాముదుసలి వెఱ్ఱివాఁడు, ఈగొల్లని పరమేశ్వరునిగా భావించి నుతించుచున్నాఁడు. వారలకేగాని ధర్మతత్త్వములు తెలియవట. ఇట్లు మెత్తమెత్తగ నీతఁడందఱిని నవమానించినాఁడు. వీనికితగినట్లు చెప్పవలెననుకొని "ఓయీ! ఈధర్మరాజుఁడు నిన్నాధారముగాఁ జేసికొని పడవవెనుక గట్టిన పడవవలె తన గౌరవమునెల్ల గంగపాలొనర్చుకొన్నాఁడు. ఈ వేషగాఁడైన కృష్ణుని మాకుచూపి పిల్లల భయపెట్టినట్లు బిభీషికలు చూపుచున్నావు. ఎంత మూర్ఖుడవోయీ ? ఈ రాజులెల్ల నీ కన్నులకు పిరికిపందలవలె దోఁచుచున్నారు కాబోలును. అర్థములేని పను లైదారెత్తి వానిని దైవతచర్యలుగా పలుకు నీనాలుక నూఱుపాయలుగా చీలినచో నప్పుడాతని నీవు పొగడఁగలుగుదువులే. నేనన్నివిషయము లెఱుఁగుదును గదా? ఆతఁడే విషయములో గొప్పవాఁడో, ఆతఁడు పూజార్హుఁ డెట్లయ్యెనో దెల్పుము ? మహాపాతకములలో నొక్కఁడైన స్త్రీవధయు, గోవధయు నాతఁడొనర్చెను. ఇంకనీవో పరునికామించిన యంబయను దానిని నపహరించి తెచ్చితివి. అదియుఁగాక నీవనపత్యతా దోషముచే పతితుఁడవైతివి. వినా యయపుర బండారములింతలో నున్నవి. వినారు "బజ్జలవుచ్చకాయవలె, అధర్మము లాచరించుచు పతు

భయపడి కిక్కురుమనక యూరకుండిరి. సభలోనుండగనే సహదేవునిపై పూలవాన కురిసెను. ఆకసముపై దేవతల సాధువాదములు చెలరేగెను. సభ్యులెల్లరును విస్మయమందిరి.

అంత శిశుపాలుని సేనాధిపతి సునీథుఁడనువాఁడు మిగుల రోషించి పరుషముగ ప్రేలాపించుచు తనవక్షమువారి నందఱను పూనగట్టుకొని తన పాలకుని సెలవంది యుద్ధ సన్నద్ధుఁడయ్యెను. ఒక క్షణమాత్రమున యదువృష్ణి భోజసైన్యములు చెలరేఁగెను. సభయందలి వారందఱును కలగబాఱిరి. అట్టి సమస్త క్షత్రియ క్షోభమునుగాంచి ధర్మరాజు భయమున తల్లడమందుచు భీష్మునిగాంచి "ఓ పితామహా! ఈరాజులెల్ల ప్రళయ సమయమందలి సముద్రములవలె మహాక్షోభమంది తెగించి నడుములుబిగించి యుద్ధసన్నద్ధులైరి. దీనిమూలమున నా క్రతువునకు విఘ్నము రాకుండను, ప్రజలకెట్టిహానియు కలుగకుండను, బోధించి వీరినిప్పుడు శాంతపఱచుము". అని దీనుఁడైప్రార్థింప నాతఁడును "ఓయీ! వెఱ్ఱివాఁడా! పిరికివానివలె హృదయదౌర్బల్యము నందెదవేల ? అజేయపరాక్రముఁడై యజ్ఞపురుషుఁడైన నారాయణుఁడు నీ క్రతువును వేయికన్నుల కాపాడుచుండ దానికి విఘ్నమొనర్ప నేరికి దరమగును? ఆతఁడొకసారి యలిగి వీక్షించునంతనే యీ శిశుపాలుఁడును వాని ననుసరించువారును భస్మీపటలము కానోపుదురు. మదమాతంగముల కుంభములను పగిల్చిచీల్చి భక్షించుసింగమును పదివేల కుక్కలు రేఁగి మాత్ర

మేమి చేయగలవు ? విఘ్నము మాట నీ మనసునకైన రానీయ వలదు. అన్నియుఁ జూచుచుందుము. ఆ పరమపురుషుఁడే దీనిని నవరించును" అనిబిగ్గఱగ బలికి యూరకున్న, శిశుపాలుఁడాగ్రహించి యీముదుసలి వెఱ్ఱివాఁడు, ఈగొల్లని పరమేశ్వరునిగా భావించి నుతించుచున్నాఁడు. వారలకేగాని ధర్మతత్త్వములు తెలియవట. ఇట్లు మెత్తమెత్తగ నీతఁడందఱిని నవమానించినాఁడు. వీనికితగినట్లు చెప్పవలెననుకొని "ఓయీ! ఈధర్మజుఁడు నిన్నాధారముగాఁ జేసికొని పడవవెనుక గట్టిన పడవవలె తన గౌరవమునెల్ల గంగపాలొనర్చుకొన్నాఁడు. ఈ వేషగాఁడైన కృష్ణుని మాకుచూపి పిల్లల భయపెట్టినట్లు బిభీషికలు చూపుచున్నావు. ఎంత మూర్ఖుడవోయీ ? ఈరాజులెల్ల నీ కన్నులకు పిరికిపందలవలె దోఁచుచున్నారు కాబోలుఁను. అర్థములేని పనులైదారెత్తి వానిని దైవతచర్యలుగా పలుకు నీనాలుక నూఱు పాయలుగా చీలినచో నప్పుడాతని నీవు పొగడగలుగుదువులే. నేనన్నివిషయము లెఱుఁగుదును గదా! ఆతఁడే విషయములో గొప్పవాఁడో, ఆతఁడు పూజార్హుఁ డెట్లయ్యెనో దెల్పుము ! మహాపాతకములలో నొక్కఁడైన స్త్రీవధయు, గోవధయు నాతఁడొనర్చెను. ఇంకనీవో పరునికామించిన యంబయనుదాని నపహరించి తెచ్చితివి. అదియుఁగాక నీవనపత్యతా దోషముచే పతితుఁడవైతివి. మీ యిరువుర బండారములింతలో నున్నవి. మీరు "ఒజ్జలవుచ్చకాయవలె, అధర్మము లాచరించుచు పరు

లకు ధర్మశిక్ష చేయు తులువలు. ఇంక శ్రీకృష్ణుని పౌరుషమును గూర్చి యొక్కమాట పలికెద. సమస్తక్షత్రియులను గడగడ లాడించిన జరాసంధుని ముందునిలువలేక భయాతిరేకముచే పదిసారులు పరువులెత్తిన మొనగాఁడీతఁడు కాఁడా? బట్టుపొగడి నట్టుగ నాతని నెత్తిచెప్పెదవేల. నీకంతయుబుసుపోనిచో మహా వీరులైన కర్ణశల్యాదుల కొనియాడరాదా? పరులను పొగడుటయు తెగడుటయు, తన్నుదాఁ బొగడుకొనుటయు, నిందించుకొనుటయు నివి పూజ్యులు చేయవలసినట్టి కృత్యములుకావు” అని యాక్షేపించెను.

దానికి మదనాఁగ మలిగినట్లు కనలి భీముఁడు రౌద్రాకారుఁడై పండ్లుపటపట కొఱుకుచు, మీసలు మెలిద్రిప్పుచు గదను సవరించుకొనుచు కనుబొమలు ముడుతలువడ, కనుగ్రుడ్లనుండి నిప్పుకలురాల సమస్త రాజులగుండెలు తల్లడమంద శిశుపాలునిమీఁది కుఱుక సిద్ధపడఁగా నాతనివారించి భీష్ముఁడిట్లనెను.

“నాయనా! ఆగుము. నా చెప్పబోవునది కొంచెమువిని నీవుచేయబోవునది పిదపచేయుము. ఈశిశుపాలుఁడు పూర్వము చేదివంశమున దమఘోషుఁడు సాత్వతియనువారలకు నాలుగు బుజములు నొసటనొక మూఁడవకన్నుతో పుట్టి గాడిద యెలుఁగుతో నేడ్చుచుండజూచి తల్లిదండ్రులు భయపడి వీఁడేటిపాపడని బెదురుచుండ గా నశరీరవాణి “వీనినెవ్వరును చంపనేరరు. ఎవ్వరు

వీని నెత్తుకొన్నచో హెచ్చుగానున్న రెండుచేతులును, మూఁడవ కన్నును నూడిపోవునో వారిచేతిలో నాతఁడు మరణించును. అట్టివాఁడె వీనికంతకుఁడు" అనివచింప వారును మిగుల నాశ్చర్యమంది చూడవచ్చువారికెల్ల వీని నెత్తికొననిచ్చుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు బలరామకృష్ణులు, మేనత్తయగు సాత్వతిని, వికృతరూపుఁడగుకొమరుని జూడవలెనని యాదేశమేఁగఁగా నామె బలరాముని నెత్తుకొమ్మని బిడ్డనందిచ్చెను. తరువాత శ్రీకృష్ణుఁడెత్తుకొనఁగా నందఱు చూచుచుండ నాతని హెచ్చుగానున్న చేతులును, కన్నునునణఁగిపోయెను. దానినికని పెట్టి సాత్వతి కృష్ణా! నీమఱఁదిని చూచితివిగదా. వానికై యొకకానుక నిన్నుకోరెదను. నీవుదాని ననుగ్రహింపుమని కోరెను. అట్లయని కృష్ణుఁడనుగ్రహింప "నాకుమారుఁడు దుష్టస్వభావము కలవాఁడై నీకనిష్టుఁడై యేమేని కానిపను లొనర్చినచో నూఱుతప్పులు నీవు మన్నింపవలెను. ఇదియే నీవు వీనికొసంగు కానుకయని కోరెను. కృష్ణుఁడును దాని ననుగ్రహించెను. కాన నా నూఱుతప్పులు నిండువఱకును వీఁడన్యులచేచంపబడఁడు. ఆ హద్దుదాటుటతోడనే కృష్ణునిచే చంపబడును.

ఈ వెనముండుటబట్టి వీఁడెన్ని "యవాకులు చవాకులు" పేలినను మన్నించితినిగాని మఱియొకఁడైనచో నీపాటికే నా యస్త్రములకు బలిపెట్టి యుండనటోయీ!" అని చెప్పుచుండ భీష్మభీములనతిక్రమించి శిశుపాలుఁడు జనార్దనికెదురై"ఓయీ!

లకు ధర్మశిక్ష చేయు తులువలు. ఇంక మీకృష్ణుని పౌరుషమును గూర్చి యొక్కమాట పలికెద. సమస్తక్షత్రియులను గడగడ లాడించిన జరాసంధుని ముందునిలువలేక భయాతిరేకముచే పదిసారులు పరువులెత్తిన మొనగాఁడీతఁడు కాఁడా? బట్టుపొగడి నట్టుగ నాతని నెత్తి చెప్పెదవేల. నీకంతయుబుసుపోనిచో మహావీరులైన కర్ణశల్యాదుల కొనియాడరాదా? పరులను పొగడుటయు తెగడుటయు, తన్నుదాఁ బొగడుకొనుటయు, నిందించుకొనుటయు నివి పూజ్యులు చేయవలసినట్టి కృత్యములు కావు” అని యాక్షేపించెను.

దానికి మదనాఁగ మలిగినట్లు కనలి భీముఁడు రౌద్రాకారుఁడై పండ్లుపటపట కొఱుకుచు, మీసలు మెలిదిప్పుచు గదను సవరించుకొనుచు కనుబొమలు ముడుతలువడ, కను గ్రుడ్లనుండి నిప్పుకలురాల సమస్త రాజులగుండెలు తల్లడమంద శిశుపాలునిమీఁది కుఱుక సిద్ధపడఁగా నాతనివారించి భీష్ముఁ డిట్లనెను.

“నాయనా! ఆగుము. నా చెప్పబోవునది కొంచెమువిని నీవుచేయబోవునది పిదపచేయుము. ఈశిశుపాలుఁడు పూర్వము చేదివంశమున దమఘోషుఁడు సాత్వతియనువారలకు నాలుగు బుజములు నొసటనొక మూఁడవకన్నుతోపుట్టి గాడిద యెలుఁగుతో నేడ్చుచుండఁజూచి తల్లిదండ్రులు భయపడి వీడేటిపాపడని బెదురుచుండఁగా నశరీరవాణి“వీని నెవ్వరును చంపనేరరు. ఎవ్వరు

వీని నెత్తుకొన్నచో హెచ్చుగానున్న రెండుచేతులును, మూఁడవ కన్నును నూడిపోవునో వారిచేతిలో నాతఁడు మరణించును. అట్టివాఁడె వీనికంతకుఁడు" అనివచింప వారును మిగుల నాశ్చర్యమంది చూడవచ్చువారికెల్ల వీని నెత్తికొననిచ్చుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు బలరామకృష్ణులు, మేనత్తయగు సాత్వతిని, వికృతరూపుడగుకొమరుని జూడవలెనని యాదేశమేగఁగా నామె బలరాముని నెత్తుకొమ్మని బిడ్డనందిచ్చెను. తరువాత శ్రీకృష్ణుఁడెత్తుకొనఁగా నందఱు చూచుచుండ నాతని హెచ్చుగానున్న చేతులును, కన్నునునణఁగిపోయెను. దానినికనిపెట్టి సాత్వతి కృష్ణా! నీమఱదిని చూచితివిగదా. వానికై యొకకానుక నిన్నుకోరెదను. నీవుదాని ననుగ్రహింపుమని కోరెను. అట్లెయని కృష్ణుఁడనుగ్రహింప "నాకుమారుఁడు దుష్టస్వభావము కలవాఁడై నీకనిష్టుఁడై యేమేని కానిపను లొనర్చినచో నూఱుతప్పులు నీవు మన్నింపవలెను. ఇదియే నీవు వీనికొసంగు కానుకయని కోరెను. కృష్ణుఁడును దాని ననుగ్రహించెను. కాన నా నూఱుతప్పులు నిండువఱకును వీఁడన్యులచేచంపబడఁడు. ఆ హద్దుదాటుటతోడనే కృష్ణునిచే చంపబడును.

ఈ నెపముండుటబట్టి వీఁడెన్ని "యవాకులు చవాకులు" పేలినను మన్నించితినిగాని మఱియొకఁడైనచో నీపాటికే నా యస్త్రములకు బలిపెట్టి యుండనటోయీ?" అని చెప్పుచుండ భీష్మభీములనతిక్రమించి శిశుపాలుఁడు జనార్దనికెదురై "ఓయీ!

అవమానింపదగిన నిన్ను నిండుసభలో గౌరవింపబూనిన ధర్మ రాజును, అట్లు ప్రోత్సహించిన యీ ముసలివగ్గును, నీవును గూడి నేడు మగతనమున్నచో యుద్ధమునకు సిద్ధపడుడు" అని గర్జించిపలుకగా అప్పుడు కృష్ణుడు సమస్తరాజులును విను చుండగా, "ఓ రాజన్యులారా! ఇంతదనుక నీతని పలుకులు వింటిరిగదా! ఇంక వీనిపాపము బిగ్గరలైనది. ప్రాగ్జ్యోతిషమున భగదత్తు నణుప మేముపోయినపుడు అన్యాయముగా వీడు ద్వారకకు నిప్పుపెట్టి బాలవృద్ధజనములకు భయముకొలిపినాడు రైవతకమున దమతమ పత్నీజనముతో క్రీడలు సలుపుచున్న భోజరాజన్యులను తెగటార్చెను. వసుదేవుఁడొనర్చు నశ్వమే ధమునందలి హయమును హరించి యజ్ఞ విఘ్నమాచరించెను. వీఁడతి పాపుఁడై బభ్రుభార్యను తనభార్యగాఁ జేసికొనెను. మఱియు నీతఁడొనర్చిన వాచాదోషము లెన్నియో గలవు. మాయత్త సాత్వతి నన్ను ప్రార్థించుటచేత యీతులువచేసిన శతాపరాధములను నేను మన్నింపవలసి వచ్చెను. ఇప్పుడు మీరందఱు చూచుచుండ వీఁడు నాపై నకారణముగ కత్తిగట్టి యున్నాఁడు" అని పలికెను.

దానికి శిశుపాలుఁడు "ఓయీ! నీప్రేమతో కాని నీకోప మూతోగాని నాకేమి పనియున్నది? ఒక్కటేమాట. నన్ను నీవు మన్నించుటో నిన్ను నేను క్షమించుటో ఈ నిముషములో తేలి పోవలెను" అని యాతఁడు యుద్ధమునకుదిగగా మహాకోపమంది

కృష్ణుఁడొకసారి చక్రమువైపు చూచెను. తోడనె యది దైవికమైన శక్తి ప్రోత్సహింప భూనభమ్ములయంతరము తనమోఁతచే ఖండించుచు, రాజచక్రమెల్ల భయకంపితము కాఁగా రివ్వున వచ్చి యాసభలో శిశుపాలు శిరమునూడ్చిపోయెను. వెంటనే రక్త ప్రవాహములు సభాస్థానమును దడిపివైచెను. చూపఱులెల్ల హాహాకారములు చేసిరి. పిదప వాని దేహమునుండి యొక దివ్యమైన కాంతి యచ్చోటును వెలిఁగించుచు శ్రీకృష్ణపరమాత్ముని దేహమును బ్రవేశించెను. ఇది యేమిది యేమని యచటి యాబాలగోపాలము విస్మయపడిరి. జయజయ వినాదములతో కృష్ణుని వారెల్ల పొగడిరి.

తరువాత వైకుంఠుఁడును శిశుపాలుని దహనసంస్కారము గావింప వానికుమారుని కానతిచ్చి పిదప వానిని చేది రాజ్యమున నభిషిక్తునొనర్చెను.

ఇట్లు నిర్విఘ్నముగాను, సుఖారంభముగను నా మహాక్రతువు జగన్నాథునిచే రక్షింపబడి పరిపూర్తిచెందఁగా ధర్మాత్మజయునిగాంచి కృష్ణాదులు సంతసించిరి. దుర్యోధనాదులు మిగుల ననూయపడిరి. సమస్తరాజులును ధర్మాత్మజుని దర్శించి మీ యజ్ఞముగావించితిరి మీ సత్కారములందితిమి క్షేమమందఱము కృతార్థులమైతిమి. ఇఁక మామా దేశములకు బోయెదము సెలవొసంగుఁడని చెప్పిన వీడ్కొని వెడలిపోయిరి. మిగిలిన రాజబంధువులనెల్ల నూతన వస్త్రాలంకార సమ్మానములచే బహూ-

అవమానింపదగిన నిన్ను నిండుసభలో గౌరవింపఁబూనిన ధర్మ రాజును, అట్లు ప్రోత్సహించిన యీ ముసలివగ్గును, నీవును గూడి నేఁడు మగతనమున్నచో యుద్ధమునకు సిద్ధపడుఁడు" అని గర్వించిపలుకఁగా అప్పుడు శ్రీకృష్ణుఁడు సమస్తరాజులును విను చుండఁగా, "ఓ రాజన్యులారా! ఇంతవఱకు నీతని పలుకులు వింటిరిగదా! ఇంక వీనిపాపము పరిపూర్ణమైనది. ప్రాగ్జ్యోతిషమున భగదత్తుని నణఁప మేము పోయినపుడు అన్యాయముగా వీఁడు ద్వారకకు నిప్పుపెట్టి బాలవృద్ధజనములకు భయముకొలిపినాఁడు. రైవతకమున దమతమ పత్నీజనముతో క్రీడలు సలుపుచున్న భోజరాజన్యులను తెగటార్చెను. వసుదేవుఁడొనర్చు నశ్వమే ధమునందలి హయమును హరించి యజ్ఞ విఘ్నమాచరించెను. వీఁడతి పాపుఁడై బభ్రుభార్యను తనభార్యగాఁ జేసికొనెను. మఱియు నీతఁడొనర్చిన వాచాదోషము లెన్నియో గలవు. మాయత్త సాత్వతి నన్ను ప్రార్థించుటచేత నీతఁడు వచేసిన శతాపరాధములను నేను మన్నింపవలసి వచ్చెను. ఇప్పుడు మీరందఱు చూచుచుండ వీఁడు నాపై నకారణముగఁ గత్తిగట్టి యున్నాఁడు" అని పలికెను.

దానికి శిశుపాలుఁడు "ఓయీ! నీప్రేమతో గాని నీకోప ముతోగాని నాకేమి పనియున్నది? ఒక్కటేమాట. నన్ను నీవు మన్నించుటో నిన్ను నేను క్షమించుటో ఈ నిముసములో తేలి పోవలెను" అని యాతఁడు యుద్ధమునకుదిగగా మహాకోపముఁబొంది

కృష్ణుఁడొకసారి చక్రమునైపు చూచెను. తోడనె యది దైవిక మైన శక్తి ప్రోత్సహింప భూనభమ్ములయంతరము తనమోతచే నిండించుచు, రాజచక్రమెల్ల భయకంపితము కాగా రివ్వున వచ్చి యాసభలో శిశుపాలు శిరమునూడ్చిపోయెను. వెంటనే రక్త ప్రవాహములు సభాస్థానమును దడిపివైచెను. చూపఱు లెల్ల హాహాకారములు చేసిరి. పిదప వానిదేహమునుండి యొక దివ్యమైన కాంతి యచ్చోటును వెలిగించుచు శ్రీకృష్ణపరమాత్ముని దేహమును బ్రవేశించెను. ఇదియేమిది యేమని యచటి యాబాలగోపాలము విస్మయపడిరి. జయజయ నినాదములతో కృష్ణుని వారెల్ల పొగడిరి.

తరువాత వైకుంఠుఁడును శిశుపాలుని దహనసంస్కారము కావింప వానికుమారుని కొనతెయిడి పిదప వానిని చేది రాజ్యమున నభిషిక్తునొనర్చెను.

ఇట్లు నిర్విఘ్నముగాను, సుఖారంభముగను నా మహాక్రతువు జగన్నాథునిచే రక్షింపబడి పరిపూర్తిచెందఁగా ధర్మతనయునిగాంచి కృష్ణాదులు సంతసించిరి. దుర్యోధనాదులు మిగుల నసూయపడిరి. సమస్తరాజులును ధర్మతనయుని దర్శించి మీ యజ్ఞముగావించియు మీ సత్కారములందియు మేమందఱము కృతార్థులమైతిమి. ఇఁక మామా దేశములకు బోయెదము సెలవొసంగుఁడని చెప్పిన వీడ్కొని వెడలిపోయిరి. మిగిలిన రాజ బంధువులనెల్ల నూతన వస్త్రాలంకార సమ్మానములచే బహూ

కరించి పాండవులుపంపి వేసిరి. బ్రాహ్మణులును నపరిమిత సంభావనలంది ధర్మరాజును బహువిధాశీర్వాదముల చే తృప్తినందించి వారివారిస్థానముల కరిగిరి. నారాయణుడును పాండునందనుల నందఱను క్రమముగ వీడ్కొని ద్వారవతికిపోవ సమకట్టి ధర్మ రాజుతో "సమస్తప్రాణులును మేఘమును, పక్షులెల్ల ఫల వృక్షములను, దేవతలిందుని నాశ్రయించి బ్రదుకునట్లు బంధు వులెల్ల నిన్నుపజీవింప సుప్రతిష్ఠితుడవై యుండుము. మఱియు నేవిధమైన చిరాకు పరాకులును లేకుండ ప్రజలను పోషించు చుండుము. నేనిక వెడలెదను" అని యనెను.

అంత ధర్మరాజు"స్వామీ! నీకరుణావిశేషముచే నీమహో ధ్వరము రమణీయమై నిర్విఘ్నమై, సంపూర్తినందెను. లోక ములో నేను సమస్తరాజులలో కీర్తినంది ప్రాధాన్యము వహిం చితిని. నాకులమును పవిత్రమై ధన్యమైనది. ఇదంతయు నీ చలు వయేగదా! కృష్ణా! ఆపద్బాంధవా! నీవు ద్వారవతియందున్నను మమ్మొక కంట గాంచుచుండవలెను. నీవు దూరమందున్నను మాకెల్లవేళల సమీపస్థుడవే సుమా! నిన్ను విడిచియుండుటకు మిగుల బెంగగానున్నది. నీవిచటనే యుండిపోవరాదా ? యని యుత్కంఠాభరమున కన్నులు చెమ్మగిలజూచుచు నెట్టకేల కాతని గమనమున కంగీకరించెను.

అంత వాయువేగమనోవేగములుగల గుఱ్ఱములుబూన్చిన రథమెక్కి, గరుడధ్వజము ప్రకాశింప, దారుకుడు రథము

కరించి పాండవులుపంపి వేసిరి. బ్రాహ్మణులును నపరిమిత సంభా వనలంది ధర్మరాజును బహువిధాశీర్వాదముల చే తృప్తినందించి వారివారిస్థానముల కరిగిరి. నారాయణుఁడును పాండునందనుల నందఱను క్రమముగ వీడ్కొని ద్వారవతికిపోవ సమకట్టి ధర్మ రాజుతో "సమస్తప్రాణులును మేఘమును, పక్షులెల్ల ఫల వృక్షములను, దేవతలింద్రుని నాశ్రయించి బ్రదుకునట్లు బంధు వులెల్ల నిన్ను పజీవింప నుప్రతిష్ఠితుఁడవై యుండుము. మఱియు నేవిధమైన చిరాకు పరాకులును లేకుండ ప్రజలను పోషిచు చుండుము. నేనిక వెడలెదను" అని యనెను.

అంత ధర్మరాజు "స్వామీ! నీకరుణావిశేషముచే నీమహా ధ్వరము రమణీయమై నిర్విఘ్నమై, సంపూర్తినందెను. లోక ములో నేను సమస్తరాజులలో కీర్తినంది ప్రాధాన్యము వహిం చితిని. నాకులమును పవిత్రమై ధన్యమైనది. ఇదంతయు నీ చలు వయేగదా! కృష్ణా! ఆపద్బాంధవా! నీవు ద్వారవతియందున్నను మమ్మొక కంట గాంచుచుండవలెను. నీవు దూరమందున్నను మాకెల్లవేళల సమీపస్థుఁడవే సుమా! నిన్ను విడిచియుండుటకు మిగుల బెంగగానున్నది. నీవిచటనే యుండిపోవరాదా? యని యుత్కంఠాభరమున కన్నులు చెమ్మగిలజూచుచు నెట్టకేల కాతని గమనమున కంగీకరించెను.

అంత వాయువేగమనోవేగములుగల గుఱ్ఱములుబూన్చిన రథమెక్కి, గరుడధ్వజము ప్రకాశింప, దారుకుఁడు రథము